

'' నాల్గు పయోధులో యనంగ, నల్వురు దిక్కరులో యనంగ...''

( దిగుమర్తి - తిమ్మావఝుల - పింగళి - నండూరి)

# చైతన్య కవిత

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్ సుందరం

# మరణ మంగళాశాసనం

-నందూరి రామకృష్ణమాచార్య

మరణ సమయమందు - మధుర గానము చాలు
వద్దు మందులేవి వాడవద్దు;
ఏ గతించి నప్పుడేడ్వరాదెవరేని
ఏడ్పు అనిన నాకు ఏవగింపు.

మైల పట్టవద్దు - మంత్ర తంత్రము వద్దు;
స్నాన శౌచ నిరతి చాలు చాలు!
జరుపవచ్చు - సుకవి సత్కార మొకనాడు,
దుఃఖలవము సుంత దొరలకుండ.

జరుపవద్దు - నాకు - శ్రాద్ధ కర్మల నేవి;
వద్దు - పెట్టవద్దు - తద్దినాలు;
బాలబాలికలకు - బహుమానములు తీర్చి
ఏ దినమున నైన ఇవ్వవచ్చు.

ఏది పూర్వజన్మ మెట పునర్జన్మమ్ము
వసుధ - మనిషి - నీరు వంటివాడు!
మంచుగడ్డ నీరు - మరి ఆవిరియు వేరు!
ఒరుగునట్టి దేమి? ఒకటియైన!!

భార్య ముగ్గరాదు పసుపు కుంకుమ వీడి
పదవనాటి తంతు వద్దు వద్దు;
భర్త చావు బాధ - భార్య ఓర్చుట చాలు;
వికట కర్మ కాండ వేధ వద్దు.

నేను నాస్తికుడను గాను - జీవితములో
మంచితనము మీద - మమత గలదు;
మతము మీద గాక - మానవత్వము పైన
కలదు గొప్ప నమ్మకమ్ము నాకు.

క్రొత్త పాతలకును - గుండె లోపల కోరి
కూడలి గుడి కట్టు కొంటి నేను;
హేతువాద సహిత సేతువై - జీవించి,
సాహితీ తపస్సు సలుప గలను.

అంతము చెందు ఈ భువి సమస్తము - సృష్టియె దిగ్దిగంత వి
శ్రాంత మశాశ్వతమ్ము రవిచంద్రుల తోడ - మనుష్యుచావు - ఓ
వింత ఉదంతమా? వికట వేదన లెందుకు? సర్వతాప ని
ర్వ్యాంత మవశ్యమంగళము - చావొక స్వస్తి వరప్రసాదమే.

దేహము దారి తప్పె - నను దివ్యునిగా తలపోసి - మేటి వ్యా
మోహము కూర్మి గౌరవము ముచ్చటలన్ కురిపించినట్టి నా
స్నేహితులెల్ల స్వర్గతులు - జీవితమిచ్చెను పూర్ణతృప్తి; నే
ఐహికమున్ త్యజించి కవితామృత దానములన్ తరించెదన్.

పృథివిలోన నాకు ప్రేయసీ మణి - నిద్ర!
స్నేహనిపుణ యెవరు నిద్ర కంటె?
కలదు- మృత్యుదేవి - కైవల్య కల్యాణి
శాశ్వత సుఖమిచ్చి - సాక గలదు.



# NATIONAL CODE OF CONDUCT

## FOR THE CITIZENS OF INDIA

1. Your country is your highest and first consideration in your life. Welfare of the country is your ownWelfare. Therefore, always be willingly ready to offer up even your life itself, for INDIA--- your country.
2. **DUTY :** Your first and foremost duty is to God and His Righteousness. Leading a righteous life will constitute the most valuable service to your Nation.
3. **Character :** Character is the greatest wealth. Pure, incorruptible character of the citizens is the greatest asset of your Nation-India. This is indispensable.
4. **Health :** Health is the basis of success in life. Health is wealth. Next to character, it is the greatest National asset and treasure. Building up character and protecting and safeguarding health, is your primary important duty, as a citizen to the Nation.
5. Eradicate the evils of liquor drinking, drug-taking, tobacco -smoking, chewing betels and gambling. Eradicate the evils of bribery, corruption, selfishness, immorality, dishonesty, and misconduct. Disloyalty to your Nation is the highest crime and greatest sin.
6. **O Citizen** you are the custodian of all public property. Do not spoil, misuse, steal or destroy National property. Preserve it with care.
7. All citizens of your country are your brethren. Fell this fellowship. Love all co-citizens and be united.
8. Have equal reverence for all religions and faiths. Love the followers of all religions as your spiritual brothers.
9. Avoid violence in any manner and avoid hatred of any kind. For this is a blot on the fair name of the Nation.
10. Adopt simple living and high thinking. Do not be extravagant. Avoid all waste. Practise frugality.
11. Uphold social justice and respect the rule of law.
12. Share what you have with your less fortunate fellow citizens. Inculcate love for your country, the spirit of patriotism and service, in your children and members of your family.

    Thus shine as a true citizen and serve your country best, by the very manner of your life and conduct.

# చైతన్య కవిత

సంపుటి: 11 సంచిక: 2

24

ధాత నామ సంవత్సరం

శరదృతువు

విజయ దశమి

OCTOBER 1996

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

చైతన్య కవితా వేదిక

40/12-7 ''సౌరభ'' (మేడపైన)

22వ క్రాసు, గోవిందరాజ నగర

విజయనగర, బెంగుళూరు - 560 040

**CHAITANYA KAVITA**, a journal devoted to Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagara, Vijayanagara, BANGALORE - 560 040, OCTOBER 1996

PP. xiv + 122

| | | | |
|---|---|---|---|
| ముఖచిత్రం మరియు అట్టవెనుక | : | ప్రముఖ కవులూ, మానవతావాదులూ, ఉత్తమ దేశికులూ, ఆంధ్ర పద్య కవితా సదస్సు అధ్యక్షులూ అయిన డా. నండూరి వేంకట రామకృష్ణమాచార్యులు గారు. | |
| అక్షరాలంకరణ | : | పి.సి. నరసింహారెడ్డి - బాపు | |
| వెల | : | విడిప్రతి | రూ. 20.00 |
| | | ప్రత్యేక సభ్యత్వం | రూ. 200.00 |
| | | జీవిత సభ్యత్వం | రూ 500.00 |
| | | పోషక సభ్యత్వం | రూ 1000.00 |
| ప్రకటనలు | : | నాల్గవ కవరు | రూ.5000.00 |
| | | రెండవ కవరు | రూ.3000.00 |
| | | మూడవ కవరు | రూ.2000.00 |
| | | పూర్తిపుట | రూ.1000.00 |

For Copies : **Prof. T. V. Subba Rao** (Retd.)
No. 40/12-7, "Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040

**M/s. Visalandhra Book House**
4-1-435, Bank Street, Hyderabad - 500 001
and all its Branches

**M/s. Novodaya Book House,**
Opp. Arya Samaj Mandir, Kachiguda,
Hyderabad - 500 027

**M/s. Pallavi Publications**
Eluru Road, Vijayawada - 520 002

DTP & Printed By: **Sree Laxmi Art Printers**
Vijayanagar, Bangalore - 40 Ph : 3300093

సంపాదకీయం :

# నిరంతర 'కవితా ప్రభాస'

'చైతన్య కవిత' కేవలం కవిత్వానికే అంకితమైన ఏకైక పత్రిక. దీనిని 1986 ఏప్రిల్ నెలలో - అక్షయ నామ సంవత్సరం ఉగాది నాడు - మైసూరు లోని 'ధ్వన్యాలోకం' అనే సాహిత్య సంస్థలో స్థాపించాం. ఇది ప్రముఖ కవుల ముఖచిత్రాలతో ప్రతి సంవత్సరం ఆరుమాసాలకొకసారి అందంగా వెలువడుతుంది. మొదటి సంచిక వసంత ఋతువు (ఏప్రిల్‌నెల) లోను, రెండవ సంచిక శరదృతువు (అక్టోబరు నెల) లోను వెలుగు చూస్తున్నాయి. ఇప్పటివరకు 23 సంచికలు వెలువడ్డాయి. ఇది 24 వసంచిక. దీనిని గురువర్యులు డా. నండూరి వేంకట రామకృష్ణమాచార్యుల వారి ముఖ చిత్రంతో వెలువరిస్తున్నాం.

డా. రామకృష్ణమాచార్యుల వారు జందెం అవసరంలేని జగమెరిగిన బ్రాహ్మణులు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి తరువాత, ఇంతగా అనంత శిష్యకోటిని సంపాదించి, వారిని అద్భుతంగా ప్రభావితం చేసిన దేశికోత్తముడు వేరొకరు లేరు. ఆచార్యుల వారు కమనీయ కవివతంసులు, రమణీయ భావుకులు, మధుర మంజుల హృదయులు, మానవతా మూర్తులు, ఈనాటి ఆంధ్ర పద్య కవితా సదస్సు అధ్యక్షులు. 50 ఏండ్ల క్రిందటనే జాతి మత కుల భేదాలకు అతీతంగా ఛాత్రసంతతిని ప్రేమించిన అమృత హృదయులు. ఒక్కసారి వీరి శిష్యరికం చేసిన విద్యార్థి జీవితాంతమూ వీరి ప్రభావానికి లోనవుతాడు. ఈ గురువర్యుని వాత్సల్యం మల్లెపూల పరిమళంలా ఆ శిష్యుని బ్రతుకు బాటలన్ని నింపివేస్తుంది. శ్రీయుతులు కొర్లపాటి శ్రీరామమూర్తి, శనగన నరసింహస్వామి, ఉషశ్రీ, తమ్మన వేంకటేశ్వరరావు, తంగిరాల సుబ్బారావు, 'ఆశావాది' ప్రకాశరావు, ('ఆసాది' ని 'ఆశావాది' గా మార్చినది నండూరి వారే), పి. సంజీవమ్మ మొదలైన సాహిత్య లబ్ధప్రతిష్ఠులందరూ ఒకప్పుడు నండూరి వారి శిష్యులే. మిక్కిలి చిన్న వయస్సులోనే భీమవరం కళాశాల ఆంధ్రశాఖాధ్యక్షపదవిని అలంకరించి, విద్యార్థులలో సాహిత్యాభి రుచిని పెంచినవారు ఆచార్యుల వారు. వీరికి దిగుమర్తి వారు కుడిభుజంగా ఉండేవారు. తరువాత ఆచార్యులవారు ప్రభుత్వ

కళాశాలల్లో శాఖాధిపతులుగాను, ప్రిన్సిపాల్‌గాను సేవలు చేశారు. అధికార భాషా సంఘం అధ్యక్షులుగా కూడా తమ ప్రతిభను చాటుకున్నారు. ఇటువంటి మహనీయ కవిశేఖరుని ముఖచిత్రంతో 'చైతన్యకవిత' తెస్తున్నందుకు మిక్కిలి గర్విస్తున్నాం.

నేను 1952 లో నా 17వ యేట ఇంటర్ విద్యార్థిగా - భీమవరం కళాశాలలో నండూరి వారి 'కవితా ప్రభాస'ను చూశాను. ఈనాడు నా 61 వ యేట కూడా అదే 'కవితా ప్రభాస' నా కన్నులకు మిరుమిట్లు గొల్పుతోంది. గురుదేవులు దిగుమర్తి వారు చెప్పినట్లు తెలుగు అధ్యాపకలోకంలో ఇద్దరే ఇద్దరు అదృష్టవంతులు. ఒకరు పింగళివారు, రెండవ వారు నండూరివారు. జీవితాన్ని సంపూర్ణంగా సంతృప్తిగా అనుభవించిన నండూరి వారికి చిరాయువును కోరుతూ - 'శతమానం భవతు' అంటూ- సెలవు.

–తంగిరాల సుబ్బారావు

బెంగుళూరు

21-10-1996 (విజయ దశమి)

ఈ క్రింది కవి పండితుల మరణానికి 'చైతన్య కవిత' తన ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తుంది:

1. చర్ల గణపతి శాస్త్రిగారు (విశాఖపట్టణం)
2. త్రిపురనేని శ్రీనివాస్‌గారు (హైదరాబాదు)
3. తూమాటి దొణప్పగారు (హైదరాబాదు)
4. ప్రముఖ చిత్రకారులు పి. టి. రెడ్డిగారు (హైదరాబాదు)

# అంకితం

1952 - 1957 మధ్యకాలంలో
భీమవరం.కళాశాలలో
నాలో
కవితాసృష్టికి అంకురార్పణ చేయించి
సాహిత్యాభిరుచిని పెంపొందించి
విమర్శ రహస్య ద్వారాలను తెరిపించి
నా ఉజ్జ్వల భవిష్య జ్జీవన సౌధానికి
సువర్ణ సోపానాలు నిర్మించిన
గురుదేవులు
**దిగుమర్తి సీతారామ స్వామి గారి**
దివ్యస్మృతికి

అంజలి ఘటిస్తూ......

''తన వాత్సల్య సుధాబ్ధిముంచి, నను నేతన్మాత్రుగా (దీర్చి, యం
తన (జాలింపక, పింగళాన్వయుని చేతన్ దీర్చి దిద్దించి, దీ
వన లందించిన దేశికోత్తముడు, వాక్ప్రాగల్భ్యదుగ్ధాబ్ధి, వం
దనముల్ మా దిగుమర్తి వంశ్యునకు, సీతారామశ్రీ స్వామికిన్!''

–తంగిరాల సుబ్బారావు

# దళవాయి దానకర్ణుడు

ఎవ్వాడు 'రుక్మిణీ' -- 'కృష్ణమ నాయక'
పున్నెంపు పంటయౌ ముద్దుబిడ్డ!
ఎవ్వాడు 'సత్యప్రభే' శ్వరి మానస
సరసిలో విహరించు జాతిహంస
ఎవ్వాడు 'కల్ప' 'తేజేశ్వరి' 'శ్రీనివాస్'
ఘనులను గన్న బంగారు తండ్రి!
ఎవ్వాడు శ్రీ వేంకటేశ్వర స్వామికి
అంకితమైన భక్తాగ్రగణ్యు
డతడు శృంగేరి కంచి పీఠాధిపులకు
సాయిబాబాకు భక్తుడు! సన్నిహితుడు!
కీర్తికెక్కిన 'దళవాయి కృష్ణసామి
ఆదికేశవు' లాతడు త్యాగమూర్తి!!

-తంగిరాల సుబ్బారావు



'దానకర్ణుడు'

శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు

బెంగుళూరు

# నమో! నమస్తే!

ఈ సంచిక యొక్క
ముద్రణ వ్యయాన్నంతటినీ
గొప్ప ఔదార్యంతో భరించిన
ప్రియమిత్రులు
నిగర్వి
దాన కర్ణుడు
'దళవాయి' వంశ తిలకుడు
రుక్మిణీ - కృష్ణస్వామి నాయుడు దంపతుల జ్యేష్ఠపుత్రుడు
చిత్తూరు- బెంగుళూరులో ఉన్న
శ్రీనివాసా ట్రస్టు మేనేజింగ్ ట్రస్టీ
అయిన
**శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు** గారికి
మా నమశ్శతములు....

''నమో నమస్తేఽస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే!''

**-సంపాదకులు.**

# శరత్తారలు

# నండూరి రామకృష్ణమాచార్య వ్యక్తిత్వం - కవిత్వం

-కొర్లపాటి శ్రీరామమూర్తి

డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య శిష్య వాత్సల్యం మూర్తీభవించిన గురువు. ప్రాతక్రొత్తల మేలికలయికల కవి. రంగస్థలం మీద రక్తికట్టిన నాటకరచయిత. చరిత్రలోను, సాహిత్యంలోను సారగ్రహణం చేసిన పరిశోధకుడు. ''రమ్యహాసలో''లుడు. సంభాషణ చతురుడు. కార్యసాధకుడు. మనస్సు వున్న మనీషి. ''నిండు మనంబు నవ్య నవనీత సమానము.'' కాని, ''పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము'' కాదు; ''శిరీష కుసుమపేశల'' సదృశం.

ఇరవై రెండవయేట పశ్చిమగోదావరి జిల్లా భీమవరం కళాశాల తెలుగు శాఖ తొలి అధ్యక్షునిగా అధ్యాపక వృత్తిని ఆరంభించి, వివిధ ప్రభుత్వ కళాశాలల్లో ప్రిన్సిపాలై, ఏభైయెన్మిదవయేట పదవీ విరమణ చేసిన ధన్యజీవి. అరవై యెన్మిదవయేట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అధికారభాషా సంఘానికి అధ్యక్షులై, తెలుగు భాష వెలుగొందడానికి, ఆ సంఘం అస్తిత్వాన్ని జేగీయమానం చేసిన ప్రజ్ఞానిధి. డెబ్బైయైదవయేట ఆంధ్ర పద్య కవితా సదస్సు అధ్యక్షులై, తెలుగు పద్యం తేజరిల్లడానికి, ఆ సదస్సు మనుగడని దేదీప్యమానం చేస్తున్న దీక్షా కంకణధారి. వయోభారాన్ని మాత్రమేగాకుండా, వ్యయభారాన్ని కూడా లెక్కచేయకుండా, పద్య పునరుద్ధరణకి శేషజీవితాన్ని అంకితం చేసిన శేముషీధురంధరుడు. ఉదారస్వభావానికి ఒక ఉదాహరణం. నిష్కామ కర్మాచరణకి ఒక నిదర్శనం.

''కాంతి నిచ్చి మలగు కర్పూరహారతై
చదువు కొరకు ఎవని బ్రదుకువెలుగు!?
జీవితమ్ములోన శిష్యులే తన కంటె
గొప్పవారలగుట కోరునెవడు?''

అని గీతాప్రవచనం చేయడమే గాకుండా, అక్షరాలా ''శిష్యులే తన కంటె గొప్పవారలగుట కోరు'' కొంటున్న గురువు. శిష్యులు ఏనాటి కళాశాల విద్యార్థులో అయినా, ఈ నాటికీ ఏనాటికీ వారి అభివృద్ధికి దోహదం చేసే దొడ్డగురువు డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య. ఇది వారి వ్యక్తిత్వానికి కరదీపిక.

ఇక కవిత్వం - ప్రారంభదశలో పరిణతమైన ''తారా తోరణము'', పరిణత దశలో ప్రారంభమైన ''ప్రగతి గీత'' ప్రసిద్ధ ఖండ కావ్యాలు. ఇరవైయేడు ఖండికల సంపుటికి ''నక్షత్రమాల'' అని దువ్వూరి రామిరెడ్డి నామకరణం. ''తారాతోరణము'' అని నండూరి రామకృష్ణమాచార్య నామకరణం. అది కేవలం పద్యకావ్యం. ఇది పద్యగేయోభయ కావ్యం. అజ్ఞాత కౌంతేయం, శకుంతలానిర్గమనం మొదలైన సంప్రదాయ కవితలు; సూక్త వసంతము, శీర్ణమేఖల మొదలైన నవ్యకవితలు; జీవిత సూక్తము, ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః'' మొదలైన ప్రబోధ కవితలు రాశీభూతమైన ప్రాత క్రొత్తల మేలికలయిక ''తారాతోరణము''.

శ్రీకృష్ణుని రాయబారం తర్వాత, కుంతీ కర్ణుల ఏకాంతసమావేశమే అజ్ఞాత కౌంతేయం. ఇతివృత్తం భారతార్థమైనా, ఇందులో కర్ణుని మాతృగవేషణ ఇతోధిక విశేషం.

''మనమున భావనాపటిమ మాతృకృపాకమనీయ దివ్యమూ
ర్తిని దరిశింపగా కలవరించితి తీయకలల్ సృజించు తీ
రని నిరుపేద కోర్కులు; పురాతన సత్యము వోలెనన్ కద
ల్చెను భవదీయ వాక్కులు విచిత్రవిషాదము రేపి నా హృదిన్.

కస్తూరినిడు రాధ కనుపాప నొకనాడు
కన్నతల్లియె నాకు కానుపించె
ఉయ్యాల జోకొని ఊగిననా డమ్మ
అతిలోక హస్తమే అరసినాడ
చిరుత ప్రాయములో నిదుర చెందిన నన్ను
కలలోన జనయిత్రి కౌగిలించె
అంగ సింహాసన మధవసింపగ నాకు
అజ్ఞాత మాతయే ఆజ్ఞనిచ్చె
రేలుపవలెల్ల అస్పష్టరీతి నక్క
డక్కడ ఇచట నచట నేనరయుచుంటి
అవ్యయ కృపా తరంగిణి అమ్మకొరకు;
కాని - ఆమె యీ నిర్భాగ్యుకంట పడదు.

ఘోరభారతయుద్ధాగ్ని కుండమందు
ప్రాణ మర్పింపవలె రాజరాజుకొరకు

కన్నతల్లిని గాంచు భాగ్యమ్మునొంద
లేను కాబోలు నీ జన్మలోన నేను.''

ఇది తన్ను గూర్చి ఏవో కథలూ, ఏవేవో గాథలూ విన్న కర్ణుని మనోవేదన. కరుణ రసకంపం కలిగించే కవిత్వం.

అర్జునుని యెడల అసూయ కలగడానికి కర్ణుడు చెప్పిన కారణం ఒక నగ్నసత్యం. మనస్తత్వ మర్మం.

''అర్జునుని పైన నా కసూయ యని ప్రజలు
పలుకుచుందురు నిజము కావచ్చు కొంత;
ప్రేమను కృతకముగ చంపివేయునెడల
ఈర్ష్యయొచు తిరిగి జన్మమెత్తుచుండు''

పుత్రప్రేమను కృతకంగా చంపివేసింది కన్నతల్లి కుంతి. అది కర్ణాకర్ణిగ విన్న కర్ణునికి ఈర్ష్య కలగడం సహజం.

కుంతి అడిగిన మీదట కర్ణుడు వరమివ్వడం మహాభారతంలోని విషయం. కుంతి అడుగకుండానే కర్ణుడు వరమివ్వడం అజ్ఞాత కౌంతేయం లోని విశేషం.

''అర్జునుడు తప్ప పాండవులాహవమున
చేత చిక్కిన కూడ హింసింపబోను
అర్జునుడు తన్ను దానె కాపాడుకొనును
అడుగకుండ నీకిచ్చితినమ్మ వరము''

అమ్మకోసం అంతగా అలమటించిన కర్ణుడు, అడుగకుండానే అమ్మకు వరమివ్వడం అత్యంత సముచితం. అంతేకాదు. ఎంత ఈర్ష్యాళువైనా, ఇంత వరప్రదాత కావడం కర్ణుని ఉదాత్తలక్షణం.

కర్ణ పాత్ర చిత్రణం కర్ణరసాయనమైన అజ్ఞాత కౌంతేయం ఉదాత్త రసాన్వితం.

శీర్ణమేఖల అంటే మణిమేఖల జ్ఞప్తికి రావడం సహజం. అది తమిళ కావ్యం. కావ్యనాయిక బౌద్ధభిక్షువు పేరు మణిమేఖల. అదే కావ్యం పేరు. ఇది తెలుగు కావ్యఖండిక. కావ్యనాయిక పేరు కాదు. శీర్ణమైన మేఖలే శీర్ణమేఖల. తెగిన మొలనూలు. భానుమతి,

దుర్యోధనుడు, కర్ణుడు, భారతపాత్రలైనా; సంఘటన, సందర్భం, సన్నివేశం- సర్వం-కవ్యుపజ్ఞం. గాఢమైత్రిని ప్రతిపాదించే ఇతివృత్తం. అపార్థం చేసుకోవడానికి అవకాశం వున్న సంఘటన. అయినా అపార్థానికి తావులేని, ప్రగాఢమైత్రి ప్రకాశించిన సందర్భం. అవైయాసకం.

ఖండిక ఎత్తుగడే కుతూహలం కలిగిస్తుంది.

''ఈ నడిరేయిలో ఇభపురేశ్వరు అంతఃపురాన హర్మ్యసో
పాన పరంపరాగ్రముల పైకి యెకాయెకి నెక్కు నెవ్వడీ
మానిసి? రాణి భానుమతి మందిర రత్నకవాట కాంతిలో
ఆననసీమ వెల్గెడిని అంగధరేశుడు సూతసూనుడే!

అర్ధరాత్రి అంతఃపుర ప్రవేశం! అది కూడా దుర్యోధనుడి భార్య భానుమతి అంతఃపురంలో కర్ణుని ప్రవేశం!! ఎంత మిత్రుడైనా వింత గొలిపే విషయం. అంతఃపుర ద్వారపాలకులు అదమరిచి నిదురపోతున్నారా? కాదు.

''అనుగు సఖుని దుర్యోధను నరయు కొరకు
పవలు రేలనక అతడు వచ్చుచుండు
కంటికిని కూర్కు లేకుండ కాచుచున్న
ద్వారపాలకులెవరాప నేరరతని.''

దుర్యోధనుడి అంతరంగంలో వున్న కర్ణుణ్ణి, భానుమతి అంతఃపుర ద్వారపాలకులు ఆపలేని మాట నిజము. అర్ధరాత్రి అయినా సరే! ఆ సమయంలో దుర్యోధనుడు అంతఃపురంలో లేడు! భానుమతి అందమైన తల్పం మీద చెలికత్తెతో చదరంగం ఆడుతున్నది. కర్ణుడు బంగరుగద్దెపై ఆసీనుడయ్యాడు. ''ఎచ్చటికేగినాడు ధరణీశ్వరుడు?'' అని అడిగాడు. ''చెచ్చెర వత్తునంచు చనె శీఘ్రముగా నెటొ పాదచారియై; వచ్చుచునుందురంచు మది భావన చేసెద'' నని సమాధాన మిచ్చింది భానుమతి. ''పోయెదనంచు'' లేచాడు కర్ణుడు. ''వచ్చెడు వేళయయ్యె - ఈ రేయి భవత్ సఖుండు నిదురింపడు మీ గమనమ్ము విన్నచో పోయినదేమి ఆగుడు ప్రభుండిదె వచ్చుచునుండు'' అన్నది భానుమతి. కర్ణుడు ఆగిపోయాడు. భానుమతి చదరంగం ఆడటానికి ఉపక్రమించింది. ఆట చూస్తున్న కర్ణుడు చెలికత్తె స్థానం ఆక్రమించి ఎత్తులు కదుపసాగాడు. భానుమతి, కర్ణుడు చదరంగం ఆడటం వింత.

''ఎంతటిమాట! హస్తినగరేశ్వరు పట్టపురాణి యట్టు లే
కాంతగృహమ్ములోన నిజకాంతుడు లేని నిశీధి నేకశ
య్యాంతర వర్తియై తమిని అన్యునితో చదరంగమాడు నా
వింతను తొంగిచూచె వినువీథిని తారలు పుల్కరించుచున్.''

ఆట ''మాంఛి రసకంధాయం'' లో పడింది. కర్ణుడు ''త్రోసిరాజొ, ఉయ్యాల త్రోసిరాజొ'' అని గుచ్చి గుచ్చి అడుగుతుండగా అరుదెంచాడు దుర్యోధనుడు! భానుమతి చూచింది. లేచింది. చూడని కర్ణుడు నిలవరించడానికి భానుమతి మేఖల పట్టుకొన్నాడు. ఆమె విదళించింది. మేఖల తెగిపోయింది. అప్పుడు కర్ణుని కంటపడ్డాడు దుర్యోధనుడు!

''కట్టెదుట నున్న కౌరవనాథుని
ప్రాణమిత్రుని మోము నరయ లేక
హైమ కాంచిని వీడి అందందు పడిపోయి
చెదిరిన మణులేర చేయిరాక
స్తంభించి నిలిచిన సతి కురుపట్టమ
హిషి అవస్థ మదినూహింపలేక
ఏమియెరుగకయె ఇంతలు సలిపిన
తన్నుగూర్చి తన కర్థమ్ము గాక
కనక తల్పము జారిన కర్ణుహృదయ
మందు విద్యుల్లతారోచి అశనిపాత
మగ్ని పర్వతజృంభణ మబ్ధిఘోష
ధరణి కంపమ్ములేకమై తాండవింప''

ఇది కర్ణుడి అవస్థ. మఱి దుర్యోధనుడి వ్యవస్థ-

''మంద మనోజ్ఞహాస సుషమా మృదుభావ మరీచి వీచికల్
కందుదలందు వెల్లిగొన కౌరవనాథుడు ఆత్మదేవికిన్
చిందిన మేఖలా మణులు చెచ్చెర నేరి యొసంగి'' ఆగ్రహం
బందిరొ రాణివారు క్షమకర్హుడు నా ప్రియమిత్రుడిమ్మెయిన్.

ఎరిగి చేసిన తప్పుగా దెంతవారి
కైన క్రమ్మును చదరంగమందు మత్తు

ఎప్పటియటుల కర్ణుని మన్నింపు మనుచు
ప్రార్థనలు సలపె ఛలోక్తి పరిధవింప''

అని కర్ణుణ్ణి తీసికొని మేడమీదకు వెళ్ళిపోయాడు. ఇది కర్ణ దుర్యోధనుల ''సుకుమార హృదయ పవిత్రమైత్రి.'' కర్ణ దుర్యోధనులు ఎలాంటి వారైనా వారి మైత్రి పవిత్రమైనదే. మైత్రి విషయంలో వారి హృదయాలు సుకుమారమైనవే.

అజ్ఞాత కౌంతేయంలోని కర్ణ పాత్ర చిత్రణం ఉదాత్తమేగాని, శీర్ణమేఖలలోని దుర్యోధన పాత్ర చిత్రణం మహోదాత్తమైనది. అంతే కాదు, ఆద్యంతం నాటకీయపద్ధతి జీవనాడిగా సాగిన కావ్యఖండిక శీర్ణమేఖల. ఇది కూడ ఉదాత్తరసాన్వితమే. వ్యాసప్రోక్తం కాని, కవిత్రయ సూక్తం కాని - శీర్ణమేఖల నవ్యకవిత్వం.

విజ్ఞానశాస్త్రం వికసిస్తున్నది. సౌకర్యాలు సమకూరుస్తున్నది. యవనికాభ్యంతరంలో విలయతాండవం విజృంభిస్తున్నది. ఇది తత్త్వశాస్త్రవేత్తల్ని కలచివేస్తున్నది. అది ప్రతి ఫలించింది ''ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః''.

'''ఆటము బాంబు' రెక్కల జలాంతరగాముల కాలకూటదుష్
కీటక వాయు జృంభణము క్రిందులు మీదులు లేక సంగరో
చ్చాటన సల్పుచున్ బ్రదుకు చావుల దుఃఖసుఖాలక్లిష్టశ్వం
గాటక ముందు నిల్చిరి జగచ్చరితంబున నేటి మానవున్''

ఇది **1950** నాటి స్థితి. ఇప్పటి స్థితీ ఇంతే. అప్పుడే కవి ఆగ్రహోదగ్రుడయ్యాడు.

''ఓ నవశాస్త్ర దారుణ మహోగ్ర కఠోర వికార ఘోరవి
జ్ఞాన వికాస మూర్తి! విషచారిత రక్తరసప్లుత ప్రభా
లీన కటాక్ష మేల ప్రసరించెదవోయి? సహస్ర శీర్ష పం
చానన విశ్వరూప విలయాంతర భీకర గర్జనార్భటిన్.''

ఇది ప్రసాదగుణ ప్రధానమైన ఖండ కావ్యంలోని ఓజోగుణభూయిష్ఠమైన రచన. ఇది రౌద్ర బీభత్స భయానకరసోచితం. ఎంత క్రోధం ప్రదర్శించినా, మఱెంత జుగుప్స ప్రకటించినా, ఇంకెంత భయపెట్టినా, ఘోర విజ్ఞాన వికాసమూర్తికి చీమ కుట్టినట్టు కాదు. సుకుమార సోల్లుంఠనమే విషకన్యాపరిష్వంగం. ఇది ''ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః'' లోని అపూర్వ విశేషం.

''ఈ పెనుమంటి దిబ్బ వసియించి రొకానొకనాడు మానవుల్
పాపము! శేముషీవిభవ పారగులై ప్రకృతిన్ జయించి వి
శ్వాపరసృష్టి సల్పి ప్రళయాంతక బుద్ధిని గుండెలేక ఆ
త్మోపహతిన్ వినాశనము నొందిరి యందరు జ్ఞానశూన్యులై'
అనుచు హతశేషమై యంత యవని మిగులు
ఏ పిపీలికలో రచియించుకొనును
కరుణగీతులను తమ వాఙ్మయములోన
నయ్యది యవశ్యభవితవ్యమేమొ మనకు''

విజ్ఞాన శాస్త్ర వికాసం ప్రపంచ సంగ్రామానికి పాల్పడితే, యావత్ప్రపంచం పెద్ద మట్టి దిబ్బ కావడం అపరిహార్యం. ఏ చీమలో మిగిలితే అవి తమ వాఙ్మయంలో మానవుల జ్ఞానశూన్యులని విషాదగీతాలు విరచించుకోవడం అవశ్యభవితవ్యమే. నిజానికి చీమలు జ్ఞానంలేనివి. మానవులు జ్ఞానం కలవారు. అటువంటిది చీమలు జ్ఞానం కలవికావడం, మానవులు జ్ఞానశూన్యులు కావడం విజ్ఞాన శాస్త్ర విపరిణామ విపర్యయం. అంతేకాదు, ప్రపంచ సంగ్రామానికి ప్రాతిపదిక అనైక్యత. అనైక్యత లేనిది చీమల బాటు. చీమల నుండి మానవులు నేర్చుకోవలసింది ఐక్యత అని ధ్వన్యర్థం.

''సకల ధరణి శాసన పరిషత్తు తోడ
ప్రజలు వసుధైక సామ్రాజ్యపౌరులగుచు
భూమి యేకకుటుంబమై పొందు నంది
విశ్వమానవ కల్యాణ వేదియగును.''

అని శాంతి వచనం. వసుధైకకుటుంబం, విశ్వమానవ కల్యాణం నండూరి రామకృష్ణమాచార్య నాద బ్రహ్మోపాసన.

ఇరవైయేడు ఖండికల తారాతోరణం లోని అజ్ఞాత కౌంతేయం, శీర్ణమేఖల, ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః అనే మూడు ఖండికలూ ఆధునికాంధ్ర కవితావిహాయస వీథిలోని ధ్రువతారలు.

హాస్యప్రియత్వం, మానవతాదృక్పథం, ప్రగతి దృక్పథం త్రివేణీ సంగమమైన ఖండకావ్యం ప్రగతిగీత. కేవలం పద్యకావ్యం. ఇదొక సప్తశతి. శృంగార రసప్రధానం కాదు. ధ్వని ప్రధానం కాకపోదు. అందుకే ''అద్యతనసాహితీ సప్తశతి'' అన్నారు.

ఇందులో మూడు భాగాలున్నాయి. 1. వెన్నల వడగళ్ళు. 2. ముత్యాల గొడుగు. 3. పన్నీటి జల్లు.

''ఎందుకీ వ్రాతలు గీతలున్?'' అని ప్రశ్న వేసికొని,

ఇచ్చిన సమాధానంలోని సారాంశం ఇది:

''... ... వెలుగుబాటలు తీరిచిదిద్ది గుండెలో
లోతులు పాతులున్ తరచి లోకము పోకడ చూచి నిల్పుతన్
శ్రోతల మానసాల చిరుజ్యోతులు ------''

ప్రగతి గీతలోని ప్రత్యంశం వెలుగు బాటలు తీర్చిదిద్దేదే. గుండె లోతు పాతులు తరచి లోకం పోకడ చూపేదే. ఏ పాటి మానవత్వం వున్నా, మానసవీథిలో చిఱుజ్యోతులు నిలిపే మాట నిజమే. ఇందుకు వెన్నెల వడగళ్ళు లోని ''కోటీశ్వరుని కుక్క'' ఒక ప్రముఖోదాహరణం.

ఒకసారి తీవ్రమైన చలిగాలికి ఒక్క బీహారులోనే వెయ్యిమందికి పైగా చనిపోయారు. కోటీశ్వరుని కుక్క మాత్రం చావలేదు. కారణం?

''కుక్కపిల్ల కొరకు కుట్టించె ఒక కోటు
పట్టువంటి ఉన్ని బట్ట పెట్టి
పసిడి గొలుసు తోడ పచ్చని మొలత్రాడు
వేలకొలది ఖర్చు పెట్టి కట్టె

* * *

కుక్కపిల్ల తోడ కోటీశ్వరుడు మేడ
వదలలేదు తెల్లవారు వరకు
తెల్లవారి నంత దినపత్రికలు లేవు
చచ్చినట్టి వారి సంఖ్య తెలుప ''

ఉన్ని కోటు కాదు, ముతక గుడ్డ లేనివారు; మేడకాదు, గుడిసె వదలవలసిన వారు చలిగాలికి చనిపోయారు.!

''భరతఖండమందు నిరుపేద గుడిసెలో
మనుజ జన్మ యెత్తి మసలు కంటె
కుక్క జన్మమేలు కోటీశ్వరుని యింట
భరతదేశ మెపుడు బాగుపడునొ!!''

అని కవి ఆవేదన. అంతేకాదు. ''మాతృక ఒక అమెరికను కవిత. (అమెరికాలో బీదవారి దైన్యమును చిత్రించిన కవితా మాతృక వెలువడగానే అచటి శాసనసభ్యుల హృదయములు కరగి పేదల శ్రేయస్సునకై క్రొత్త చట్టములు వెలువడినట్లు తెలియుచున్నది.)'' అని కవి అధస్సూచిక. ఇచటి శాసనసభ్యుల హృదయములు కరగి పేదల శ్రేయస్సునకై క్రొత్త చట్టములు వెలువడినపుడు భారతదేశము బాగుపడునేమో!

వెన్నెల వడగళ్ళులోని 'భోగిమంటలు' అనే ఖండిక ప్రగతి శీలానికి ఒక ప్రత్యేకోదాహరణం.

''కాలదోషమ్ము పట్టిన గతచరిత్ర
ఎండిపోయిన పిడకల దండవోలె
కట్టగట్టి కన్నులు మూసి కాల్చవోయి
భోగిమంటలలో నీకు పుణ్యముండు.

* * *

స్వస్థాన వేష భాషా మమత్వము చేత
గుండె గప్పిన సాలె గూళ్ళనెల్ల!
స్వీయమతాభిని వేశమ్ము మనసులో
పెంచిన పెనుముండ్ల కంచెలెల్ల!
జాత్యభిమాన పిశాచి పూనుట చేత
బుఱ్ఱకెత్తిన గంగవెఱ్ఱులెల్ల!
విద్యామదము పదవీమదమ్ము ధనము
దమ్ము వేసిన వెఱ్ఱితలలనెల్ల
కారణాంతరముల కలగూరవోలె
ఒడలిపై మొలిచిన కుక్క గొడుగులెల్ల
భోగిమంటలలో నేర్చి కాగబెట్టి
వేడినీరు శిరస్స్నాన మాడుమయ్య.

కడుపు మాడి గుంటపడిన కంటిమంట
భోగిమంట గొలిపి ఆరిపోయినట్టి
గరళకంఠుని మూడవ కన్నునిపుడు
రగులు కొల్పుము దుష్టమారణము కొరకు!''

'ముత్యాల గొడుగు' ముఖ్యంగా ''ముక్తకాల'' సంపుటి. సుమారు మూడువందల పాతిక పద్యాలు. ముత్యాలసరులు పోహళించినట్టు అకారాద్యనుక్రమణికలో ఉన్నాయి. కొన్ని మచ్చు తునకలు:

## అగ్ని పరీక్ష

''అగ్నియందు కరగి అపరంజి వెలుగొందు
మట్టి - గట్టిపడును మాడిపోయి
దొడ్డవాడు వెలుగు దురదృష్టదశయందు
అల్పుడైన యెడల అణగిపోవు''

## కవి

''కవివరేణ్యుడనిన అవతారపురుషుండు
సాహితీచరిత్ర చదువునపుడు
కవియొకండు ప్రక్క గదిలోన నివసింప
ప్రహసనమ్ములోని పాత్ర అతడు!''

## చిత్ర లేఖనము

''దున్నపోతు కొట్టె తోకతో గోడపై
బురదగుంటయందు దొరలి వచ్చి
నవ్య చిత్రలేఖనమ్ములో అల్లదే!
వచ్చెననిరి జనము స్వర్ణశకము''

## తెలుగు పద్యము

''అందచంద మొలుకు ఛందస్సు రుచిగల్గి
యతులు గలిగి ప్రాసయతులు గలిగి
తీపిలయలు గలిగి తెలుగులో పద్యాలు
హొయలు గలిగి యెడదలూపగలవు''

## పెద్దపదవి

''ఏనుగెక్కినపుడు ఎత్తుగా కన్పించు
పొట్టివాడు గూడ పుడమినుండి
తెలివిలేని జడుడు తేజస్విగా దోచు
పెద్దపదవియన్న గద్దె మీద''

## యంత్రనాగరకత

''యంత్ర నాగరకత యావజ్జగత్తులో
దొరతనమ్ము చేయదొడగె నేడు
మనిషి యంత్రమందు మరమేకుగా మారి
అస్వతంత్రుడగుచు అలమటించు''

## శాంతి

''విసిరివేయలేవు వింజామరలు వేయి
గగనమందు గ్రమ్మ కారుమబ్బు
ప్రజల గుండెలందు రగులు సంక్షోభమ్ము
త్రోసివేయలేవు శాసనాలు''

## హక్కులు

''హక్కులున్నవనుచు ఆరాటపడనేల
బాధ్యతలను మరచి పౌరజనులు
పరమనిష్ఠతోడ బాధ్యతల్ నెరవేర్ప
అడుగకుండ వచ్చు హక్కులెల్ల.''

### క్షమ

''చదువు మీది మెట్లు సంస్కృతి - సహనముల్
చదువు క్రింది మెట్లు చాలగలవు
సంస్కృతికిని క్షమకు జనయిత్రి యొకతెయే
క్షమకు మీదిమెట్టు స్వర్గమొకటె''

'పన్నీటి జల్లు' కూడా ముక్తకాల సంపుటమే. ఇందులో 112 శీర్షికలున్నాయి. అవీ అకారాద్యనుక్రమణికలోనే. అంతేకాదు, ఈ 112 పద్యాలకి ''రమ్యహాసలోల రామకృష్ణ'' అని మకుటం వుంది. అన్నీ ఆటవెలదులే. వేమన పద్యాల సరణి. స్వరూపాన్ని బట్టి శతకప్రాయం. అని చెప్పి సంప్రదాయ కవిత్వం కాదు. ఆధునిక విషయాల పైన మాత్రమే అధిక్షేపాత్మకమైన రచన. స్వభావాన్ని బట్టి నవ్యకవిత్వమే. పన్నీటిజల్లు పరిమళాలకి కొన్ని మచ్చు తునకలు:

### అభ్యర్థి

''ఓడి విశ్రమింపలేడు గెల్చెడిదాక
ఎన్నికలకు నిల్చి ఎవ్వడైన
నెగ్గి ఓడు వరకు తగ్గబోడెవడైన
రమ్యహాసలోల రామకృష్ణ''

### ఆత్మహత్య

''పండుకొనెను రైలు పట్టాల కడ్డమ్ము
ఆత్మహత్య కొరకు అతివయొకతె
ఆమె యెట్టుకోక ఆపివేసెను రైలు ॥రమ్య॥''

### ఓట్లుకొనుట

''ఓట్లుకొనెడివాడు ఉరకే యిచ్చునా?
దాచిపెట్టినట్టి ధనము తెచ్చి!
అమ్మివేయగలడు అతడు దేశమ్మునే ॥రమ్య॥''

## తత్త్వమసి

''శౌర్యసాహసములు సార్వభౌముల జేసె
పెంచె దైవసంఖ్య పిరికితనము
నిన్ను నీవు తెలియ నీవె దేవుడవయా ॥రమ్య॥''

## పరిపాలన

''నాడు - కుక్క తోక నాడించుచుండె బో
దొరలు ఏలుచుండ భరతభూమి
నేడు - తోక - కుక్కనాడించుటకు పూనె! ॥రమ్య॥''

## భీష్మద్రోణులు

''ఊరిలోన పెద్దలున్నార లెందరో!
ద్రోణ భీష్మసములు దొడ్డవారు
ఒక వికర్ణుడున్న ఇకచాలు వెదకరా ।రమ్య॥''

## విరోధాభాస

''తల్లి రత్నగర్భ తనయుడు నిరుపేద
బాష్పధార గార్చు భరతమాత
ఎంత వింతయైనదీ విరోధాభాస ।రమ్య॥''

ఇవి దయార్ద్రహృదయం, ఆధునికతా మేధ కురిపించిన కన్నీటికణాల పన్నీటి జల్లులు. హాస్యరసశబలితమైన కరుణ రస కళికలు. సమాజ రుగ్మతలకి కస్తూరి గుళికలు. నండూరి రామకృష్ణమాచార్య తారాతోరణంలో కవిమాత్రుడు. ప్రగతి గీతలో ప్రవక్తృభూతుడు.

* * *

# TRIBUTE TO A LITERARY POWER HOUSE

**- P. V. L. NARASIMHA RAO**

An eminent poet, a respected Professor, an erudite scholar and a powerful orator, all-in-one-that's Dr. Nanduri Venkata Ramakrishnamacharaya for you! He strode the Telugu literary scene like a colossus for around five decades. He writes, and writes in English too. At seventy plus, even today he wields pen with aplomb.

Nanduri is a rare exception to the rule that writers do not praise writers. A host of stalwarts like Dr. C.R.Reddy, Indraganti, Karunasri and Dr. Prasadaraya Kulapathi, to name only a few, speak high of the literary prowess of this multifaceted genius. Prof. G.J. Somayaji calls him "a future tense amongst the modern poets." He is perhaps the present tense linking the past with the future. Dr. Nanduri is at the vanguard of classicists, "who are anxious to regain for poetry its dignity as the symbol of all that is beautiful and true" (*CONTEMPORAY INDIAN LITERATURE*, Sahitya Akademi, New Delhi). Their style, a blend of tradition and modernity, has become a trend setter.

I hapened to be the reviewer of his excellent book "Telugu Padya Silpam" (Structural beauty of Telugu Poem) for the Hindu (April 25, 1995)*. A little later, I had a pleasant surprise, an interesting letter from the great Nanduri Rama Krishnamacharya! `Pleasant', since it took me down the memory lane of the early sixties, when we were together at Anantapur. (He was the Telugu Professor in the Government Arts College and I the Dist. PRO). `Surprise,' since he asked me whether I would write an overview of his various writings, a task as easy as pumping the ocean waters through a lift irrigation bucket. Finally, I ventured to try the impossible. Result; this small tribute, a bird's eye view of Dr. Nanduri's works.

---

* Reproduced later as a part of this tribute.

## KAVITHA PRABHASA

I start with `Kavitha Prabhasa', (literary splendour) an eloquent testimony to the writer's in-depth knowledge of men and matters. This is a compiltion of over 400 poems on such diverse subjects as Einstein, fine arts, politics, grammar, tongue, sunrise, holidays and marriage et al. Each poem is a masterpiece of worldly wisdom told in straight forward crisp style. I am sure, readers would like to get most of them by heart and recite at leisure (I do it myself) for intellectual enlightenment.

Brevity of communication and felicity in expression in highlighting extraordinary ideas on ordinary things or events is certainly a literary feat. Similarly, teaching without being didactic is no mean achievement. What is creditable is, while achieving the above, this writer never fell into the rhetoric trap, generally found in this class of poetry.

The beginning, a fitting tribute to Mahatma Gandhi, to whom this book was dedicated, gives us a glimpse of Nanduri's patriotic fervour. He had the rare opportunity of welcoming the father of the nation at Madras on January 21, 1946 with literary flowers spreading the fragrance of freedom. These poems, then published in *ANDHRA PATRIKA*, the leading Telugu daily of the day, will be instructive to the present generation. Here is a specimen, which portrays Mahatma's simplicity.

GANDHI

" He never floated in the skies,
Nor tried to swim the ocean;
He always walked the earth,
Along with his fellow human beings."

It is well-nigh impossible to bring the niceties of the original in any transliteration.

Three examples are given below, which indicate the stylistic trend of the book.

DEMOCRACY

What can we say in this democracy?
Today's small fish becomes a whale tomorrow,
Even a dog can ascend the throne;
A cunning Jackal might rule the forest.

WIFE'S EYES

The husband's eminence and achievements
Are reflected in the spark of wife's eyes;
The teacher's greatness
Is reflected in the skill displayed by the students.

PUNCTUALITY

Punctuality is the first duty
If we have to achieve progress;
A leader should stick to timings
And should not waste people's time.

## TELUGU PADYA SILPAM

*TELUGU PADYA SILPAM* (Poetic Sculpture), A treatise with a difference, this presents a vivid Panorama of the thousand year old Telugu literary inheritence in a nutshell. Its author Nanduri Ramakrishnamacharya, an eminent poet, professor and critic, traces the genesis and growth of Telugu Poetry with Copious illustrations from the works of a galaxy of poets including Kavithrayam, Srinatha, Pothana, Peddana, Molla, Vemana, Chilakamarthi, Kandukuri, Tirupathi Venkata Kavulu, Pingali, Devulapalli, Rayaprolu and Jashua. These gems reflect the majestic rhythm, melodious music, structural sturdiness and sculptural nuances of the Telugu Poem. Tributes from such stalwarts as Dr. C.R.Reddy, Indraganti, G.J. Somayaji and Karunasri confirm the author's outstanding achievements.

Sri S. V. Lakshmipathi Rao acts as the curtain raiser of this book. Dr. Prasadaraya Kulpathi, a leading poet and scholar, in his

preface "Padmasanam" shows how the writer scucceeded in establishing the immortality of the Telugu Poem. His style being a blend of tradition and modernity,. the author is considered a neo-classicist. However, he maintains that the three main genres of Telugu Poetry-Padyam (Poem), Geyam (song), and Vachanam (prose/free verse) - are equally important. Since the two earlier Telugu Jnanpith awardees Viswantha and Narayanareddy, represent "Padyam" and `Geyam" respectively, the author hopes that the next winner might be a `free verse' writer.

Nanduri highlights three significant, but less-known, facts about Telugu:

1. Prakrit, and not Sanskrit, is the spring board from which Telugu emerged and developed.

2. Pampakavi, a Telugu Poet, wrote Mahabharatha in Kannada, long before Nannaya, the `Adi Kavi' (first poet) transcreated the same in Telugu.

3. The Popular belief that classicists lack social commitment is false.

This book with an attractive cover design by Gangadhar should have looked more elegant but for a few repetitions (chadalamida, PS XIV & 5, Jonnachenu, 3 & 62, Atajani 3 & 36, Ame peru 7, 18 & 55) and advertisements; however, these are only minor hiccups. All things considered, `Telugu Padya Silpam' is an artistic masterpiece, which should be read by students and Professors, Poets and scholars as well as all connoisseurs of Poetry. (*THE HINDU, April 25, 1995*).

## TARA THORANAM

Tarathoranam (garland of stars) is one of Dr. Nanduri's earliest and most well-known `Khanda Kavya' (short poetical writings on different themes), which brought due encomiums and es-

tablished him as a top-ranking Telugu poet. It is in the fitness of things that he dedicated this charming work to his scholar-cum-freedom fighter uncle, Sri Atmakuri Govindacharya, who took care of his childhood with affection (Krishnamacharya lost his mother at an early age).

This is perhaps responsible for the all-Pervasive experience in defferent spheres, which must have stood him in good stead in becoming a writer of consequence and commitment.

In this introductrion of the first edition released in 1949, Dr.C.R. Reddy observed that the writer could achieve the best blend of tradition and modernity in the key literary areas of style, language, and meter. Most of the topics of this book have been translated into a number of Indian langauges.

For constrains of space, the review is limited to a couple of topics. One is "Om santhi, santhi, santhi" (this reminds the adaptation of this immortal phrase by the Nobel Laureate T.S.Eliot in his *WASTE LAND*). Paying rich tributes to scientific advancement, the poet wonders how this had not contributed to establishment of peace. His query raised fifty years ago, that how electronic media like radio and TV, the hallmark of modern civilization, will serve any purpose with out a `heart' is valid even today. Dr. Nanduri visualised the concept of a global village (with all round peace) long back. The treatment of the subject looks philosophical, but in essence of highly pragmatic.

The second is *SIRNA MEKHALA* (the diamond belt), an interesting episode from Mahabharatha. It happened like this. Karna visited the royal bedroom of Duryodhana one evening, when Bhanumathi, the queen was playing chess with her maids. She pleaded with Karna to stay back as it was time for the her husband to return.

Slowly, Karna took the place of the maid and immersed in the game. Dyryodhana was about to enter, when the match reached

an interesting phase. Suddenly, Bhanumathi got up from the bed leaving the game and Karna pulled her saree with force for continuing the game, when the diamonds tied to the waist belt fell down and scattered. Seeing his friend, Karna's heart palpitated like a burning volcano, with embarrassment writ large on the face.

The atmosphere suddenly turned pleasant with Duryodhana requesting Bhanumathi to forgive his friend, as everything happened in the height of ecstasy of the chess game. Bhanumathi smiles, and all is well that ends well. The story might be apocryphal; yet remains a monumental testimony to genuine friendship.

Tarathoranam, although a work of the forties, is still popular in the nineties. I am sure, its popularity will continue in the twenty first century too.

Dr.N.V.R. Karishnamacharya's literary output might not indicate a `quantum leap' but surely reveals `total quality management'. The late Sri. N.T.Ramarao availed his services as the chairma of Official Language Commission. A few students obtained doctorate degrees from Andhra and Tirupati Universities, for their theses on Dr. Nanduri's writings. These, by no means, reflect the poet's outstanding contribution. Recognition is seldom the true benchmark of achievements. I have tried to make an objective appraisal, which becomes only the tip of an ice berg. I am not sure whether I have done justice to this onerous task.

Dr. Nanduri occupies a permanent and coveted place in the annals of Telugu literature. About this I have no doubts whatsoever. Lastly, I wish to expres my heartfelt thanks to him for affording this opportunity to enrich my own literary knowledge in this process. May God Almighty grant him a long life, strength and will power to contribute many more literary gems for the benefit of the society.

నృత్యనాటికలు : గోదావరి- జ్యోత్స్నాభిసారిక- శ్రమఏవజయతే- వాసవి కన్యకా పరమేశ్వరి ఇత్యాది.

వచన గ్రంథాలు : కవిత్రయం- కావ్యాలోకం- తెలుగు పద్య శిల్పం- ప్రాచీన దక్షిణ భారతదేశ చరిత్ర ఇత్యాది.

10. మీకు కవిత్వం వ్రాయాలని మొట్టమొదటసారిగా ఎప్పుడు అనిపించింది?

1939లో నేను ఎస్.ఆర్.ఆర్.& సి.వి.ఆర్. కళాశాల (బెజవాడ) లో విద్యార్థిగా ఉన్నప్పుడు - ప్రత్యక్ష గురువు విశ్వనాథ సత్యనారాయణ గారు పద్యరచన పోటీ నిర్వహించినపుడు నేను కొన్ని పద్యాలు వ్రాశాను. అందులో ఒక పద్యం

గోదావరికి కల్కి- కుల్కుల నాట్య వి
న్యాసములు నేర్పె నన్నయ కవి
తెలుగు దనమ్ము వాల్గనుల అంచుల జార్చ
తెనుగు వాణికి నేర్పె తిక్కన కవి
మందార మకరంద మాధుర్యములు తెల్గు
పొలముల పండించె పోతన కవి
స్వర్గలోకము నుండి పారిజాతము దింపి
తెనుగు సాహితి నాటె తిమ్మన కవి
తెలుగు హృదయాల తంబురా తీగె మీటి
అమృత రసతరంగిణి చేసె త్యాగరాజు
మువ్వగోపాలు చిన్నారి మురళి తోడ
తాండవింపగ జేసె క్షేత్రయ్య గీతి.

నాకు మొదటి బహుమతి వచ్చింది. బహుమతి ప్రధాన సమయంలో విశ్వనాథ వారు అన్న మాట:- ''ఈ చిరంజీవి మూడుగంటల వ్యవధిలో ఈ పద్యం వ్రాశాడు. ఇట్టి పద్యం - మూడు రోజులు, కాదు మూడు వారాల వ్యవధి ఇచ్చినా నేను వ్రాయలేను'' - ఆ మాటలకు అప్పుడు నేను మురిసిపోయాను. ఆ వాక్యం విశ్వనాథ వారి ఔదార్య సహృదయతకు నిదర్శనం మాత్రమే, నాకవితా ప్రతిభకు కాదు - అని ఇప్పటి వరకు నాకు తెలియలేదు. కవితా గురువులుగా నేను స్మరించే వారిలో విశ్వనాథ సత్యనారాయణ గారు నాకు సాహితీ భిక్ష పెట్టారు. పింగళి లక్ష్మీకాంతంగారు నాకు సాహితీ సేనాపతి

Dr. Krishnamacharya's poems include *TARA TORANAM, PRAGATI GEETA and KAVITA PRABHASA.* In these poems Dr. Krishnamacharya is modern in content and neo-classicist in form. These poems are written in traditional simple metre in mallifluous Telugu.

Dr. Krishnamacharya's plays Dhrmachakram, Chatrapati, Sri Krishnadevarayalu, his eight one-act plays which include Tyagaraju, Veeraabhishekam, Brahmanayani Swagatam became popular. He wrote three Dance Dramas - Jyotsnaabhisaarika, Godavari and Sramaeva Jayate (Labour Alone Triumphs). Sramaeva Jayate is on a theme borrowed from the Mahabharata. The theme centres round the dignity of labour, equality and freternity. It envisages the interlinking of the rivers of the India to avoid floods and famines. It is a scintillating synthesis of classical idealism and humanist aspirations. This Dance Drama has since been translated into Hindi, English, Tamil and Kannada.

Dr. Krishnamacharya is a good biographer also; he wrote `Amarajeevulu' a book consisting of the life sketches of Buddha, Christ and Mahatma. Dr. Krishnamacharya is a good translator also; he translated Ganjigaatha and Kalidasa's `Vikramorvaseeyam' into Telugu. He published his `Kavyaalokam' - a book on the Indian Poetics. He wrote valuable prefaces to Karunasri Jandhyala Papaiah Sastry's poems. They were colleagues and choose to tread the same path in poetry. A Ph. D., was awarded for the research work on Dr. Krishnamacharya's works.

Dr. Krishnamacharya worked in the Tirumala Tirupati Devasthanams (T.T.D.) as Editor of Publications (1980 - 1982). He headed the State Official Language Committee from November '87 to January '90 as Chairman of the Committee. He tried his best to develop Telugu to suit the new situation and to implement the Telugu as Official Language right from the local offices to the Secretariat level.

Dr. Krishnamacharya, now in his seventies, is youthful in spirit and still continues to contribute to both creative and critical literature.

పాత్ర ప్రసాదించారు. కట్టమంచి రామలింగారెడ్డి గారు నన్ను సాహితీ సేవకుని చేశారు. రెడ్డిగారు నా తారాతోరణమునకు పీఠిక వ్రాశారు. రెడ్డిగారికి - తిక్కన రచనపై అభిమానం మెండు. ఆయన ''అలతి అలతి పదముల కాహళ సంధించిన'' విధమున కవితలు చెప్పవలెనని అనేవారు. ఆయనకు బాగా నచ్చిన కవితలు వేమన పద్యాలు. నేను ఇప్పటికి వ్రాసిన ఆటవెలది పద్యాలు సుమారు 1500 సంఖ్య దాటుతుంది. నాకు పరోక్షగురువు వేమన. అయితే ఆటవెలది పద్యరచనలో నాలుగు మాత్రల గణాలు స్వచ్ఛందంగా పరిహరించాలని నా అభిప్రాయం.

ఆటవెలది యన్న - యావదాంధ్రము నందు
వేమనకవి పేరు వినగ నౌను;
ఆ పునాదిపైన - హర్మ్య రేఖలు కట్ట
ఉత్సహింతు శక్తి యున్న కొలది.

11. ప్రాచీన కవులలో మీకు ఇష్టులు ఎవరు? ఆధునిక కవులలో ఎవరు?

ప్రాచీనకవులలో నాకు కవిత్రయం మీద అభిమానం ఉంది. అయితే నాకు ఇష్టమైన ఏకైక కవి ఎవడూ లేడు. కాని ఎన్నో ఇష్టమైన కవితలు ఉన్నాయి. అట్లే - ఆధునిక కవిత్వంలో ఎన్నెన్నో ఇష్టమైన కవితలు ఉన్నాయి. ఏకైక కవి ఇష్టుడు నాకు ఎవరూ లేరు. ఇష్టమైన సమ కాలీన కవులు కాబోజీ నారాయణ రావు + కరుణశ్రీ.

12. పద్య కవిత్వాన్ని గూర్చి వచన కవిత్వాన్ని గురించి మీ అభిప్రాయం?

చక్కని చిక్కని కవిత్వం - పద్యరూపంలో, గేయరూపంలో, వచన రూపంలోనూ ఉండవచ్చు. అక్కగారైన గేయకవితకు అనుగు తమ్ముడు పద్యం. రంగస్థలంపై విద్యుద్దీప కాంతులలో - చెమికీ కోటు తొడిగిన నటులలో ఎవరు ప్రతాపరుద్రుడో, ఎవరు పేరిగాడో గుర్తించటం కష్టం. పద్యంలో ఏది కవిత్వమో గుర్తించలేము. ''గద్యం కవీనాం నికషం వదంతి'' అన్నారు . (ఛందోబద్ధమైన శ్లోకంలో సంస్కృతాలంకారికులు). పద్య కవితలలో పేరిగాళ్లసంఖ్య హెచ్చు. ప్రతాపరుద్రులు తక్కువ. అయితే సహజ కవచ కుండలాలు అనదగిన యతి ప్రాసలతో సద్యోయౌవనంలో ఉద్భవించేది పద్య కవిత. సర్వాంగ సౌష్ఠవం గలది గేయకవిత. పద్య కవిత వైతాళికమే. రాగతాళబద్ధమైనది గేయకవిత. నాకు పద్యకవితపై పక్షపాత ప్రీతి ఉన్నదని అంగీకరించుచున్నాను.

# జీవన రేఖలు

## (చైతన్యకవిత సంపాదకుడు తంగిరాల సుబ్బారావు వేసిన ప్రశ్నలకు నండూరి రామకృష్ణమాచార్యులవారు- ఇచ్చిన సమాధానాలు)

1. పూర్తిపేరు : నండూరి వేంకట రామకృష్ణమాచార్యులు
2. జననం : 29-4-1921, అగ్రహార గోపవరం, పశ్చిమగోదావరి జిల్లా
3. తల్లిదండ్రులు : వేంకటమ్మ-శోభనాద్ర్యాచార్యులు
4. స్వగ్రామం : కానుమోలు- కృష్ణాజిల్లా
5. విద్యాభ్యాసం :
   - ప్రాథమిక విద్య : కోరుకొండ - తూర్పుగోదావరి జిల్లా
   - ఉన్నత పాఠశాల : పురపాలకోన్నత పాఠశాల-ఏలూరు
   - కళాశాల : ఎస్.ఆర్.ఆర్.,& సి.వి.ఆర్. కళాశాల - విజయవాడ
   - విశ్వవిద్యాలయం : ఆంధ్ర విశ్వకళాపరిషత్తు - విశాఖపట్టణం
   - పరిశోధన : మైసూరు విశ్వవిద్యాలయం - మైసూరు
6. అభిరుచులు : కవిత్వం, నాటకాలు
7. గురువులు : జీవితంలో ఎందరో మహానుభావులు గురువులున్నారు. అందరికీ వందనములు.
   - కవితా గురువులు : కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, పింగళి లక్ష్మీకాంతం, కట్టమంచి రామలింగారెడ్డి, వఝుల చిన సీతారామ శాస్త్రి, దువ్వూరి వెంకట రమణ శాస్త్రి, అబ్బూరి రామకృష్ణ రావు.
8. ఉద్యోగ వివరాలు :ఆంధ్ర శాఖాధిపతి- భీమవరం, అనంతపురం, చిత్తూరు కళాశాలలలో. కళాశాల అధిపతి - తాడెపల్లిగూడెం కళాశాలలో, విశాఖపట్నం కృష్ణా కళాశాలలో, చీరాల బాలికా కళాశాలలో, కాకినాడ పీఠికాపురాధీశ్వర కళాశాలలో. తిరుపతి పుస్తక ప్రచురణశాఖ సంపాదకుడుగా, తిరుమల తిరుపతి దేవస్థానం ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘు అధ్యక్షపదవి.
9. రచనలు: కవితలు : తారాతోరణం - ప్రగతిగీత - కవితాప్రభాస
   - నాటకాలు : ఛత్రపతి శివాజీ- శ్రీకృష్ణదేవరాయలు- ధర్మచక్రం.
   - నాటికలు : ఉరికంబం- త్యాగరాజు- మరణాంతకం- వీరాభిషేకం ఇత్యాది.

BOOKS OF

# Dr. N.V.RAMA KRISHAMACHARYA

| TITLE | YEAR OF PUBLICATION |
|---|---|
| Dharma Chakram | 1949 |
| Tara Thoranamu | 1949 |
| Buddha - Jesus - Gandhi | 1949 |
| Chatrapati Shivaji | 1950 |
| Kavya Lokamu | 1955 |
| Tales of Genji | 1958 |
| Srikrishna Deva Rayalu | 1958 |
| Early South Indian History | 1966 |
| Godavary | 1976 |
| Pragati Geeta | 1976 |
| The Maha Bharata | 1983 |
| Kavita Prabhasa | 1992 |
| The Gandhian Era | 1992 |
| Srama Eva Jayate | 1993 |

Dr. Nanduri V. Ramakrishnamacharya was born in 1921 at Agrhara Gopavaram, a village in Krishna - Godavari delta. He was risen to popularity early in life has a freedom fighter and a poet. He was awarded the SIR GEORGE STANLEY prize in 1940 B.A.(Hons.), English, Andhra University.

He served as principal, Andhra Pradesh Educational Service and retired on 30th April 1976. He was the Chairman, Official Language Commission, Goverment of Andhra Pradesh from 1987 to 1990.

# Dr. NANDURI RAMAKṚISHNAMACHARYA

(ENTRY IN THE ENCYCLOPAEDIA OF INDIAN LITERATURE, VOLUME - VI)

**-P. Sanjeevamma**

Dr. Nanduri Ramakrishnamacharya was born in Agraharam Gopavaram of what is now called West Godawari District of Andhra Pradesh, in 1921. He is a versatile wrier. He wrote Poems, Plays, Dance Dramas and Treatises on many topics. His thesis on Tikkana the author of most of the.cantos of the Telugu Mahabharata has become a standard reference work and is considered one of the best critical works on the Mahabharata. Apart from these Telugu works he has written `The Mahabharata' in prose and `The Gandhian Era' both in English. He has also written on the Ancient South Indian History and Literature.

Dr. Ramakrishnamacharya was born and brought up in a family of Freedom fighters. He himself participated in the Freedom struggle.

Dr. Ramakrishnamacharya took his Honours degree from Andhra University and Ph.D., from Mysore University. He was a disciple of Viswanatha Satyanarayana and Pingali Lakshikantam well-known scholar-poets. He joined the State Education Service in 1955 and served the department in many capacities. He is an eminent Teacher of Telugu Language & Literature. He served the Andhra and Osmania Universities as the U.G.C. Professor (1976 - 1978).

In 1955 he received an Award from the Telugu Bhasha Samithi for his book `Kavitrayam' (The poet trio - Nannaya, Tikkana and Errana - the authors of the Telugu Mahabharata).

In Dr. C.R.Reddy's words, "Krishnamacharya is a symbol of superlative synthesis of the old and the new, tradition as well as innovation".

''తాళబద్ధమైన - లాలిత్యగతిగల్గి
నడక - సొంపులొలుకు నాట్యమగును;
శ్రవణ సుభగమైన ఛందోనియతిగల్గి
పలుకుబడుల కూర్పు పద్యమగును.''

వచన కవితలో గేయంలోని లలనా లాలిత్యంగాని -
పద్యరచనలోని క్రమశిక్షణ గాని ఉండదు.

''అరయ - వచన కవిత ఆడంబరము సుమ్ము
మెరయవచ్చు మబ్బులురవు వచ్చు
వాన నీటి వరద వైశాల్యమేగాని
స్నాన మాడ దగిన సరసి గాదు.''

13. జీవితానికి అర్థం ఏమిటి?

నేను సమాధానం చెప్పటానికి శక్తిలేని ప్రశ్న వేశాడు ఆచార్య తంగిరాల సుబ్బారావు. అయితే ఈ ప్రశ్నను కొంచెం మార్చి సమాధానం చెప్పగలను. జీవితానికి సార్థకత ఏమిటి? ''మంచినెంచి ప్రోత్సహించు బుద్ధి''. కాదు- జీవితానికి అర్థం ఏమిటి? చెప్పమంటే నా సమాధానం-

''జగతియెల్ల - మధుర సౌందర్యమయమంచు
కనులు మూసి కలలు గాంచినాను,
కనులు విప్పతెలిసె - కర్తవ్యమయమంచు
రమ్యహాసలోల - రామకృష్ణ.''

14. మీ జీవితంలో మీరు సాధించినది ఏమిటి?

ఏమో? ఏమి చెప్పగలను. నాకు సంతానం హెచ్చు. తథా శిష్య సంతానం. కీర్తిశేషులు ఉప(శ్రీ)- లక్ష్మణ యతీంద్రులు - వంగల పార్థసారథి - కేశనకుర్తి వీరభద్రాచారి - కవి =కలుగోట్ల విజయాత్రేయ- సుగృహీత నామధేయులు డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి- ఆచార్య తంగిరాల సుబ్బారావు - శనగన నరసింహ స్వామి - పాటిలు తిమ్మారెడ్డి - చెన్నయ్య, ఆశావాది ప్రకాశరావు ప్రభుతులు నన్ను గురువుగా భావించవచ్చు. ''దీపాత్ దీపవత్'' వెలుగు వెల్లివిరియ చేశానని - నేను ప్రమిదనే కావచ్చు -కాగడాలు వెలిగించానని నాకు ఏదో పవిత్ర సంతృప్తి, నిరర్థక గర్వం ఉన్నవి.

అదృష్టవశాత్తు ఆధునికులలో నాకు గురుపీఠం ఏర్పడినది. అయితే ఒక హెచ్చరిక అవసరం.

''కాగి కాగి -పాలు - గడ్డ మీగడ కట్టు
పిదప మారిపోయి పెరుగు అగును
చదివి చదివి పడయు జ్ఞానమ్ము విద్యార్థి
గురువు - ''తోడు చుక్క'' పెరుగునందు.''

15. ఇకమీద మీరేమి చేయదలచుకున్నారు?
ఇంకా పద్యాలు వ్రాయటం మానలేదు. నావయస్సు 75 సంవత్సరాలు. నాయోగ్యతకు మించిన సత్కారాలు - పదవులు నాకు లభించినాయి. ఆర్థికంగా లోటు లేదు. కుటుంబ సమస్యలు లేవు.

''కోరుకొనను ధనము - కోర నే స్వర్గమ్ము
లేదు నాకు పదవి మీద - కాంక్ష
యోగ్యులైన వారి కుపకార మొనరించి
గుప్తదానమిచ్చు కోర్కె కలదు.''

---

## లలిత కళలు

''కవిత - శిల్ప - చిత్ర - గాన విన్యాసముల్
క్షాళనమ్ము చేయగలవు - హృదిని
తీర్చిదిద్దగలవు దివ్యసంస్కారమున్
అమృత యోగసిద్ధి నవఘళించి.''

–నందూరి రామకృష్ణమాచార్య

---

# ప్రగతి గీతా ప్రవక్తకు
# కవితా కర్పూర నీరాజనము

**1**

ఎవ్వాని గళములో నవ్వుకొన్నది నంద
　　　　నారామ మధుర మందార వల్లి
ఎవ్వాని కలములో నివ్వటిల్లెను విశ్వ
　　　　భారతీ మంజు మంజీర రవము
ఎవ్వాని చెలిమిలో నివ్వాళు లెత్తెమ
　　　　పర్దాలు లేని సౌహార్దలక్ష్మి
ఎవ్వాని కలిమిలో పవ్వళించెను సుప్త
　　　　గుప్తదానవ్రతప్రాప్త తృప్తి
అతడు - నండూరి వంశ పయః పయోధి
చంద్రముడు; రామకృష్ణమాచార్య సుకవి;
గద్య పద్య తారాతోరణాద్యనేక
కావ్య నిర్మాణ చాతురీ సవ్యసాచి.

–కరుణశ్రీ: జంధ్యాల పాపయ్యశాస్త్రి

**2**

అతడు శ్రీరామకృష్ణమాచార్య సుకవి
ప్రగతి గీతా ప్రవక్త - పుంభావవాణి
ఋషి - మనీషి - సత్ కవితా కిరీటధారి
ఆంధ్ర సాహిత్య సూక్తి రత్నాకరుండు

ఎండిన బ్రతుకుల జీవము
పిండంగల భాస్కరుండు, విజ్ఞాన సుధా

భాండము, నెలమిం దలతున్
నందూరి రామకృష్ణుని నవనీత మతిన్.

ననుమేల్పాదున బెట్టి, దోహదముల్ గావించి, నీర్పోసి, పూ
చిన కన్గొంచు, ప్రమోదమంది, విమలాశీర్వాదముల్ గూర్చు, ప్రా
జ్ఞునకున్, కోసి శరీరమిచ్చినను హెచ్చుంగాదు, మత్పద్యగు
చ్ఛనికాయంబున రామకృష్ణ కవితా చార్యున్ ప్రశంసించెదన్.

-ఆశావాది ప్రకాశరావు.

### 3

హృదయ మమృత సముద్రము; వదనము కవి
తా లతాంగికి నర్తనశాల; సదన
మతిథి కోటికి నాటి ఋష్యాశ్రమము; వి
శాలవసుధాకుటుంబి నీసాటి నీవె.

మా దేశిక స్వామి మత్తేభ గమనమ్ము
ఛాత్రపాళికి సదాచార శిక్ష!
మా దేశిక స్వామి మంద్ర కంఠ ధ్వని
శిష్యరాజికి సుఖాసీన ముద్ర
మా దేశిక స్వాని మధురానురాగమ్ము
కావ్య పాళికి ధైర్య కంచుకమ్ము!
మా దేశిక స్వామి మంగళాశీ రేఖ
కవి కుమారులకు మార్గప్రదర్శి!
మా గురుస్వామి శుభ్రాంఘ్రి మండలములు
శిష్యతతి మౌళులకు సుమ శేఖరములు;
సహృదయుడు రామకృష్ణమాచార్య గురుడు;
సాటి లేనట్టి కవితా కిరీటధారి.

అది చదరంగమందుగల అద్భుత తన్మయ శక్తి ఎప్పుడున్
మెదడు తదేక నిష్ఠమెయి నిల్వగజేయును; హస్తియుగ్మమున్
కదిపి హుయాహుటిన్ మెరసి కౌరవాజ్ఞి బలమ్ము చీల్చి అ
భ్యుదయము చెంది గర్వభరితోక్తుల నెమ్మది సంభ్రమింపగన్.

''త్రోసిరాజా! లేకుయ్యాల త్రోసిరాజా!!
కోరుకొను'' మంచు కర్ణుడు గుచ్చి గుచ్చి
పౌరవేశ్వరు రాణిని ప్రశ్న వేయు
చుండ మెట్లెక్కుచుండె దుర్యోధనుండు.

ద్వారము వెన్క నుండి; మదవారణయాన మనోజ్ఞ మంద గం
భీర విధాన మేడపయి మెట్లను ఎక్కుచు వచ్చుచున్న ఆ
కౌరవనాథు భానుమతిగాంచి తటాలున ఆటవీడి బం
గారపు పట్టు పాన్పుదిగ కర్ణుడు కొంగునుబట్టె నిల్పగన్.

క్వణదణు కింకిణీ కలిత కాంచన మేఖలయై, ఝుళంఝుళన్
మణిమయశింజినీ రవళి మార్మొగమై విదలించె ఆమె కొం
గును; అపరంజి కాంచి తెగి కూలెను కర్ణుని హస్తవేగ చా
రణమున, హేమ రత్నమణి రంజిత కోమల కుట్టిమమ్ముననన్.

కట్టెదుటనునున్న కౌరవాధీశుని
ప్రాణమిత్రుని మోము నరయలేక
హైమకాంచిని వీడి అందందు పడిపోయి
చెదరిన మణులేర చేయిరాక
స్తంభించి నిలిచిన సతి కురు పట్ట మ
హిషి అవస్థ మది నూహింపలేక
ఏమి యెరుగకయె ఇంతలు సలిపిన
తన్ను గూర్చి తనకర్థమ్ముగాక

కనక తల్పము జారిన కర్ణు హృదయ
మందు విద్యుల్లతారోచి అశనిపాత
మగ్నిపర్వత జృంభణ మబ్ధిఘోష
ధరణి కంపమ్ము లేకమై తాండవింప.

మందమనోజ్ఞహాస సుషమామృదుభావమరీచివీచికల్
కందుదలందు వెల్లిగొన కౌరవనాథుడు ఆత్మదేవికిన్-
చిందిన మేఖలా మణుల చెచ్చెరనేరి యొసంగి ''ఆగ్రహం
బందిరొ రాణివారు క్షమ కర్ణుడు నాప్రియమిత్రుడిమ్మెయిన్.

ఎరిగి చేసిన తప్పుగాదెంత వారి
కైన క్రమ్మును చదరంగమందు మత్తు:
ఎప్పటియటుల కర్ణుమన్నింపు'' మనుచు
ప్రార్థనలు సలిపె ఛలోక్తి పరిఢవింప.

అనునయ మొంది రాణి అధరాంచలమందలి లేతనవ్వు వె
ల్గును మృదులాంగుళీగ్రసిత కోమల పక్ష్మములందణంచి యూ
ర్చెను; కురుచక్రవర్తి తన స్నేహితుజేకొని మేడమీదికిన్
జనె; నునుసోగ వెన్నెలల చల్వలు గ్రమ్మె ధరాతలమ్మునన్.

వెన్నెలలకంటె చల్లని వెలుగు వెల్లి
విరియు సుకుమార హృదయ పవిత్రమైత్రి
ఎల్లలోకాలలో ప్రసరింపసాగె
అమృతరోచు లాచంద్రతారార్కమౌచు.

* * *

# శీర్ణమేఖల

నండూరి రామకృష్ణమాచార్య

ఈ నడిరేయిలో ఇభపురేశ్వరు అంతిపురాన హర్మ్య సో
పాన పరంపరాగ్రములపైన కెకాయెకి ఎక్కు ఎవ్వడీ
మానిసి? రాణి భానుమతి మందిర రత్న కవాట కాంతిలో
ఆననసీమ వెల్గెడిని అంగధరేశుడు సూతసూనుడే!!

అనుగు సఖుని దుర్యోధను నరయుకొరకు
పవలు రేలనక అతడు వచ్చుచుండు;
కంటికిని కూర్కు లేకుండ కాచుచున్న
ద్వారపాలకు లెవరాపనేర రతని.

అంత కవాటమున్ దెరచి అతడు లోనికి ఏగినంత ఏ
కాంత వినోదకేళి చెలికత్తెనుగూడి సుయోధన క్షమా
కాంతుని కాంత హైమమణి కల్పిత సుందర తల్పమందు అ
త్యంత నివేశ నిష్ఠ చదరంగమునాడుచు నుండె నమ్మెయిన్;

వెలుగు నీడల గళ్లలో వెలసి మణి మ
యోభయ తురగ గజ భట వ్యూహరచన
రత్న దీపాంకుర ప్రభారాగ పంక్తి
మెరయు చుండె కన్నుల మిరుమిట్లు గొలిపి.

అంగ ధరాత లేశ్వరుని ఆగమనమ్మును గాంచి, వారలున్
చెంగున తల్పసీమడిగి చెంతను నిల్చిరి: సూతసూనుడన్
బంగరు గద్దెపై నొడలు వ్రాలిచిమెల్లగ విశ్రమించె; ఆ
అంగనలున్ తమిన్ తిరిగి ఆటకు చేరిరి తోడుతోడుతన్.

''ఎచ్చట కేగినాడు ధరణీశ్వరు''డంచు నతండు దేవినే
నెచ్చెలి కోసమై అడిగె, నెమ్మదిగా మరుపల్కె ఆమెయున్:
''చెచ్చెరవత్తునంచు చనె శీఘ్రముగా నెటొపాదచారియై;
వచ్చుచునుండునంచు మదిభావన చేసెద నే ప్రతీక్షనై''.

''పోయెద'' నం చు పల్కి చనబోయెను తల్పమునుండి లేచి రా
ధేయుడు దేవిభానుమతి తెల్పెను ''వచ్చెడి వేళయయ్యె - ఈ
రేయి భవత్ సఖుండు నిదురింపరు మీ గమనమ్ము విన్నచో
పోయినదేమి ఆగుడు ప్రభుండిదే వచ్చుచునుండు వ్రేల్మిడిన్.''

అని బదులాడి దేవి చదరంగము నాడుట కుద్యమించి నే
ర్పున చెలి ఆటకట్టుటకు పూనినయంతట కర్ణుడల్లన
ల్లన సఖివైపుచేరి పదిలంబుగ రాజును గాచి దేవి ఆ
టనె కదలించి పైచెను హుటాహుటి వారణచారణమ్మునన్.

కర్ణుడంతట ఆ చెలికత్తె స్థాన
మాక్రమించి తల్పమ్ముపై నధివసించె;
ఊడిగంపు చెలియ ప్రక్కకొదిగి నిలువ
ఎత్తు పై ఎత్తుల ఆట సాగించి రంత.

ఎంతటిమాట! హస్తినగరేశ్వరు పట్టపురాణి యట్టు లే
కాంత గృహమ్ములోన నిజకాంతుడు లేని నిశీధి ఏక శ
య్యాంతరవర్తియై తమిని అన్యునితో చదరంగ మాడునా
వింతను తొంగిచూచె వినువీథిని తారలు పుల్కరించుచున్.

కౌరవ చక్రవర్తి తన కర్ణుడు ప్రాణసమానుడంచు శృం
గార గృహమ్ములో చనవుగా ప్రియమార ప్రవేశమిచ్చి ఇం
పారగ గౌరవింప మరియాద గణింపక రాజరాజు దే
వేరిని గూడి ఆడు నృపవేశ్మమునందున సాహసమ్ముతో.

భోజ మహీమహేంద్రు ముఖముంగని, మున్, జడుడున్ కవిత్వ వి
భ్రాజితుడయ్యె నంచు విను పల్కులు, నిక్కువమయ్యె; నీ ముఖాం
భోజముఁ జూచినంత, నెద పొంగెను తీయని కైత; యిట్టిదా
వ్యాజము కాక నేను కవి నౌటకు వేఱొక హేతు వున్నదే!

– శనగన నరసింహస్వామి

**4**

ధైర్యము రొమ్ము విచ్చినది; ధర్మము త్రాసున తూఁగె; అంచితా
చార్యము వ్రేళ్ళు పాతుకొనె; దక్షత పీఠము వైచి నిల్చె; సత్
కార్యవినిర్వహమ్ము ఇలుగట్టి వసించెను; రామకృష్ణ మా
చార్యుల గుండె లోతుల ప్రసన్నతలో, మధురానుభూతిలో.

– గాదేపల్లి కుక్కుటేశ్వరరావు

**5**

మెరపుతీగెలు మెదడులో మెరయుగాక!
గుండెలో క్రొత్త విలువలు పండుగాక!
చదువ నండూరి కృష్ణమాచార్య వర్యు
పద్యమొకటిండు! ద్రాక్షాసవమ్ము వలదు!

సారమందు సాటి - నూరు కావ్యాలకు
ప్రగతిగీతలోని పద్యమొకటి;
భావి తరములకు జీవ పాథేయమ్ము
ప్రగతిగీత సుప్రభాత భేరి!

గీతకు దీటుగా ప్రగతి గీతను వ్రాసి జగద్ధితమ్ముగా
నీతికి నీతి నేర్పిన మనీషివి; కట్టితి వీవు సాహితీ
సేతువు క్రొత్త పాతలను చేర్చి; భవత్ కృషి - విశ్వ సంస్కృతి
జ్యోతిగ - సర్వదా - వెలుగుచుండును మానవతా పతాకమై.

– వంగల పార్థసారథి.

## 6

సంస్కృతాంధ్రాంగ్లాది సాహితీ పాథోధి
నడుగంటగన్న మంథాచలంబు
ఆంధ్ర పద్యకవిత్వ హైయంగవీనంబు
త్రచ్చి విబుధుల కందిచ్చు దాత
కవితారసామృతోద్భవ భూమి కవిచంద్ర
బాంధవుండగు కళాపక్షపాతి
సామాజిక స్పృహధామంబుగా కైత
సంతరించెడి కవిచక్రవర్తి
సాహితీ సేవకుండు నిష్కామయోగి
శారదాదేవి గుడికి పూజారి యతడు
ప్రథిత నండూరి వంశ జైవాతృకుండు
రామకృష్ణమాచార్యుడు ప్రాజ్ఞమౌళి.

సచ్చరితుండితండు తన సాహితికిన్ ప్రజలిచ్చుమెచ్చి మున్
ముచ్చటగానొసంగినవి ముప్పదివేల్ కవితాసదస్సుకై
వెచ్చముచేసె నయ్యది కవిత్వసరస్వతి సొమ్మటంచు; తా
బిచ్చము నెత్తి యా కవితపేర్మికినెత్తె పసిండి బావుటా.

అది సామాన్య సదస్సుకాదు సువిశాలాంధ్రప్రదేశాంచలా
వధి విద్వత్కవిసార్వభౌమ కవితా ప్రస్తావ రంగస్థలం;
బదిమున్నెవ్వరు నిర్వహింపనిది; యీ యాచార్యవర్యుండహో!
ముదుకండయ్యును ఉక్కుగుండె కలిమిన్ మోసెన్ మహాశైలమున్.

ఛాందసుండు కాడు చందస్సు తలదాల్చు
వచనవైరికాడు పద్యశిల్పి
నాస్తికుండు కాడు నవభావకలితుండు
సాహితీ సపర్య శ్వాస తనకు.

రాగద్వేషాతీతున
కీ గురునకు గలదు శిష్యహితవర్గం బే
మాగాణము పరికించిన
ద్యోగురునకు దక్క దిట్టి యోగంబెపుడున్.

-యార్లగడ్డ వెంకట సుబ్బారావు.

7

పాలిత శిష్యవత్సలుడు - పద్యకవిత్వ కళారహస్యముల్
హేలన నాచికొన్న సుకవీంద్రుడు దేశిక సార్వభౌముడై
యేలెను తెల్గునేల, విరియించెను శిష్యసుమాళి - శారదా
శ్రీలు విదిర్చె గంట మవలీల న.రా.కృ. మహత్వ దక్షతన్.

గీతరచన అతని కేళికారామమ్ము
ఎన్ని ఒడుపులేని ఇవతళించు
పద్య కవిత కొఱకు ప్రాణమ్ము పణముగా
ఉద్యమించు వృద్ధయువకుడతడు.

-పోచిరాజు శేషగిరిరావు.

8

తనచూపు లోని స్నిగ్ధత శిష్యహృత్కంజ
వాత్సల్య సూర్య బింబంబు గాగ
తన పల్కు లోని మార్దవము వాఙ్మయ గంగ
జనియించు నీహార శైలమనగ
తన దరహాస ముద్ర కవిత్వ గగన రా
కాచంద్ర సాంద్రవిక్రాంతి గాగ
తన కీర్తి శరదంబర నితాంత కుంద ము
క్తాహార విదిత సంక్రాంతి గాగ

నలరు విద్యార్థి కల్పకంబగు మహర్షి
భూరి కరుణాస్పదుండు నండూరి బుధుడు
సంస్కృతాంధ్రాంగ్ల నందనాంచ ద్విహార
సరసమతి రామకృష్ణమాచార్య సుకవి.

-మేడసాని మోహన్.

## 9

శీర్ణ మణిమేఖలా కావ్య సృష్టికర్త
తెలుగు నధికార భాషగా తీర్చునేత
వేల శిష్యుల హృదయాల వెలుగుమాత
రామకృష్ణుడు ధీ రస రాజ్య దాత.

-గరికిపాటి నరసింహారావు.

## 10

రమ్య 'నండూరి' వంశ క్షీరాబ్ధి మధుర
చంద్రమా! 'రామకృష్ణమ్మాచార్య' దేవ!
సరస సుకుమార సాహిత్య సార్వభౌమ!
విజయ కవితా నమస్సుమవీచిఁ గొనుమ.

చల్లని గుండె - విరజాజుల తావుల పూలగుండె ఉ
త్ఫుల్ల సరోజ సుందర శుభోదయ మంద మరంద మాధురుల్
చల్లెడు తేనె గుండియ రసార్ణవముల్ ఘన రామకృష్ణ సం
పుల్ల యశస్క సద్గురు విమోహన కావ్య కళా ప్రసన్నతల్.

బరువౌ సాహితి చిక్కనౌ తళుకు శుంభద్వేగ ధారా ఝరీ
భర మాధుర్యము తావకీన సువచః ప్రత్యూష భాస్వంతి నీ
కరుణోదారత ధారవోయ కలమున్ గైకొంటి నర్తింతు నె
వ్వరి కబ్బుంగల భాగ్యమిద్ది - గురుదేవా! కొమ్ము శిష్యాంజలుల్.

కవి - మహోఋషి - సాసిత్య కనక నగము
గురుడు - నండూరు దుగ్ధాబ్ధి హరిణధరుడు
రామకృష్ణమాచార్య కళావిరాజ
చరణ రాజీవ యుగళి కంజలి ఘటింతు.

దేశికాగ్రణి నండూరు ధీ వినోద
దుగ్ధపాథోది సంజాత తుహిన కరుడు
రామకృష్ణమాచార్య కళామహర్షి
సాహితీ మహారథికి అంజలి ఘటింతు.

–కలుగోట్ల విజయాత్రేయ

---

## అపజయం

''జయ మహోత్సవాలు - సత్కార సంస్తుతుల్
పతన హేతువులగు బ్రతుకు నందు
అపజయమ్ము గొప్ప వ్యాయామశాలయై
అవతరింపజేయు ఆత్మశక్తి.''

## విషయ సంకలనం

''విషయ సంకలనము విజ్ఞానమా? కాదు
ఇటుక అము వేరు - ఇల్లు వేరు;
అస్థిపంజరమ్ము అసలు దేహము కాదు
ప్రత్తివేరు - నేతబట్టవేరు.''

–నండూరి రామకృష్ణమాచార్య

---

# మాధవపెద్ది కవితా మాధుర్యం

-పోచిరాజు శేషగిరిరావు

భావకవితా యుగంలో మెఱుపులు మెఱయించిన కవులలో మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి (1890-1950) ఒక్కరు. సంక్లిష్ట భావాన్ని కూడా సౌలభ్యంతో చెప్పగల జాణ. కవిత్వపులోతులూ శైలీ నిర్మాణాలూ బాగా ఆకళించుకొన్నవాడు. భాషపై అధికారం కలవాడు. 'వేదుల' లాగే, జీవితంలో తనకు కల్గినక్లేశాలను పద్యాలలో ఏకరువు పెట్టుకొని, కవిత్వరూపంలో పాడుకొని ఉపశమనం పొందినవాడు. పూర్వ కవుల కవితా శిల్పపులోతులు తెలిసినవాడు. అందుచేతనే ఏ పద్యం కూర్చినా, అది క్రొత్త ఒయ్యారాలు పోతూ కులుకుతుంది. భావగీతంలో కవిత్వ లావణ్యం ఎక్కువ ఉంటుంది. కృష్ణశాస్త్రి ఒక చోట అంటాడు: ''కవిత్వంలో శబ్దం కిటికీ వంటిది. దానిలోంచి వెనకాల ఉన్న దూరలోకాలూ, గగనఖండాలూ; తోపులూ, తోటలూ కనపడతాయి'' (కృష్ణశాస్త్రి వ్యాసావళి - 2వ భాగం - 21వ పుట). నిజానికి శబ్దశక్తి అట్లాంటిదే.

పూర్వకవుల బాణీలో కండగల పద్యాన్ని చెప్పి మెప్పించిన ప్రముఖ భావకవి మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి.

విద్య - ఉద్యోగం: తిరుపతి వేంకట కవులు అవధానాలు చేస్తూ తెలుగునేల నాలుగు చెరగులా విశృంఖలంగా పర్యటిస్తూ ఉన్న సందర్భంలో, ఈ కవి ఆకర్షింపబడి, ఆశువుగా పద్యాలు చెప్పే సామర్థ్యం తొలుత అలవరచుకొన్నాడు. 1912 ప్రాంతంలో శతావధాని చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారికి శిష్యుడైనాడు. వారి శుశ్రూషచేస్తూ మాఘము, సిద్ధాంత కౌముది అధ్యయనం చేసినాడు. అయితే అతనికి తోచినట్టు చదువుటే కాని, వెంకట శాస్త్రి గారి యేర్పాటును బట్టి చదివే అలవాటు లేదు.

బుచ్చిసుందర రామశాస్త్రికి 'నాదనామక్రియ' రాగం అంటే వల్లమాలిన అభిమానం. పద్యాలను ఆ రాగంలో పాడుతూ, కవితా వినోదాలతో కాలక్షేపం చేస్తూ ఉంటే, ఈ కవిచుట్టూ అనేకులు సహృదయులు, కవితా రసజ్ఞులు, అభిమానులు చేరి చిత్రార్పిత ప్రతిమల్లా పరవశులై పోతుండే వారంటే, అది అతిశయోక్తి మాత్రం కాదు.

ఈయన సంభాషణ చారిమం అనితరసాధ్యమైంది. మాటలలో పద్యాల్లో హాస్యాన్ని చతుర చారిమంతో మేళవించి సామాజికులను చమత్కారాలతో చక్కిలిగింత పెట్టడంలో ఈతని కీతడే సాటి.

బుచ్చిసుందరరామశాస్త్రి గుంటూరు జిల్లాలోని బ్రాహ్మణ కోడూరులో 1890లో జన్మించారు. తల్లి ఆదెమ్మ. తండ్రి శంకరయ్య పరమ పౌరాణికోత్తముడు. మాధవపెద్ది ప్రాచ్యభాషా పట్టం పొందిన తర్వాత, స్వస్థలమైన బ్రాహ్మణకోడూరులోనూ, చింతపల్లిపాడు, రెంటచింతల, ఫిరంగిపురం ఉన్నత పాఠశాలల్లో పనిచేసి మన్నన కెక్కినాడు.

**ఆరని కవితా దీపం:** భార్య కామేశ్వరి నడివయస్సులో గతించింది. దానికి తోడు ఆర్థిక దురవస్థ. ఆరోగ్యం చెడి, ఉబ్బసమునకులోనై చాలా కాలం బాధపడ్డాడు. పాపం! ఇవి, ఆయనలో బీజమాత్రంగా ఉన్న పారలౌకిక చింతనను మరింత పెంపు చేసినాయి. ఇన్ని ఇక్కట్ల చీకట్లు ముసురుకొన్నా, జీవితం కష్టాలకు ఆటపట్టయినా, ఆతనిలో కవిత్వ దీపం ఆరకుండా వెలుగుతూనే ఉంది. వాస్తవానికి ఆయన కవిత్వంలోనే జీవించినాడు.

ఈయన చదవు, సంధ్యల గురించి చెళ్ళపిళ్ళ వారిట్లు చెప్పారు 'బృందావన' ఖండకావ్య పీఠికలో (20-11-37). ''ఇతని చదువు గానముతో మిళితముగానే ఉండును గాని, నాకు 'రేగుప్తి' వలెనే, యితనికి నాదనామ క్రియ అనెడి రాగము మీద నభిమాన మెక్కువ. ఆ కారణము వలన నాకు శిష్యుడై కూడా, నాచదువు ధోరణీ యితర శిష్యులతో పాటుగా నీతడనుకరించువాడు కాడు. ఇతడు పద్యం చదవు ఫక్కి మిక్కిలి శ్రావ్యముగా నుండును. ఒకరి త్రోవకు బొత్తిగా లేఖినిని నడుపనివాడు.'' ఇది చెళ్ళపిళ్ళ వారిచ్చిన విలువైన 'సర్టిఫికెట్టు'.

**'కవిత్వం పై ' కవిత్వం:** మాధవపెద్ది, కవిత్వంపై తన అభిప్రాయాలను కవిత్వంలోనేవెల్లడించినాడు. కవికి, నవద్వీపాలు పరిభ్రమించే పరిధే. అదే ఆతని రాజ్యం. దానికి ఆత్మవేదమూ మానస శాస్త్రమూ అన్నవే ప్రమాణాలు. హృద్గత భాషవల్ల మాత్రమే ఈ కావ్యప్రపంచంలోని రసజగద్ వ్యవహారాల గుట్టు మట్టులు రసజ్ఞుడు తెలిసికోగలడు.

మా నవఖండ మండల సమన్విత రాజ్యముకాత్మవేదమున్
మానస శాస్త్ర మన్నదె ప్రమాణము, లీ పరిపాలనం బొకిం
తేని యెరుంగ రాని దొక హృద్గత భాషనెకాని, దానిసే
కానగవచ్చు మా రసజగద్ వ్యవహార సమస్త శాఖలున్.

ఖిన్నతలో కూడా తీపి కలిగించేది, దరిద్రుని సంపన్నుని భిన్నత లేని మార్గమున పెట్టేది కవిత్వమంటూ సాహిత్య రసజ్ఞశేఖరులను హెచ్చరిస్తూ ఒక పద్యం విసిరారు మాధవపెద్ది.

ఖిన్నతనేని తీపి కలిగించి దరిద్రుని - భాగ్యవంతునిన్ -
భిన్నత లేని మార్గమున బెట్టు కవీశ్వర రాజ్యమందు, గై
కొన్న కొలంది నెల్లరకు కొల్ల రసానుభవంబు, రండు! మీ
పున్నెము పండి వచ్చినది, భోక్తలు గండు రసజ్ఞశేఖరుల్.

'సత్యపదార్థ కీర్తనము సల్పెడు మత్కవితా సరస్వతీ
నిత్యత చాలు, స్వర్గమును నీరస మీ రససిద్ధి ముందటన్'
- అంటూ గొంతెత్తి చెప్పిన కవితోన్మత్తుడు మాధవపెద్ది

ప్రతిభావ్యుత్పత్తులు సముచిత ప్రమాణంలో జీర్ణించుకొని రచనలు చేసిన నవ్య కవులలో భావకవులదే అగ్రతాంబూలం.

సంస్కృతంధ్రాల్లో చక్కని పాండితి గడించుకొన్నాడు. ప్రాక్తన సంప్రదాయానికి దగ్గరగా ఉంటూనే కొత్త చవులూరే కవిత్వాన్ని అల్లడంలో దిట్ట బుచ్చిసుందర రామశాస్త్రి.

అంతర్నిగూఢ తాపాన్ని కవితలో కరగించి పోసిన కవి. భావస్ఫుటత, భాషాపటుత వియ్యమందినట్లుంటుంది కవిత. ఖండకావ్యాలన్నీ ధారాశుద్ధి దంతురములైనవే.

రామాయణంలోని కొన్ని కమనీయ శ్లోకాలు కరగించి సీస పద్యాల్లో మూస కట్టించినాడు. అట్లే భారతంలోని సంజయ రాయబార ఘట్టం పునః కవిత్వీకరించినా, రసవత్తరంగా రూపు దిద్దుకొన్నది.

రామకథాభరితాలైన శబరి, పంచవటి, చిత్రకూటము, అశోకము అను కావ్య సరస్సులను నిర్మించినాడు మాధవపెద్ది.

**పంచవటి (1945)** : ఇందలి పాత్ర ప్రకాశధోరణి వినూత్నము. ఇందు ప్రధాన పాత్రలు సీతారామ లక్ష్మణులు. కవికి గోదావరి యిట్లు దర్శనమిచ్చింది.

నడికిరేయి జలక్రీడ గడిపిపోవు
నప్సరోజన దివ్య దేహముల నుండి
లులిత మగుచుంట తన్నదీ జలము సతము
లలిత లలితంబు లాలిత లాలితంబు.

రామ లక్ష్మణుల ప్రేమ సంపూరిత సౌభ్రాత్రమున కద్దము పట్టిన పద్యాలిందు నెలకొన్నాయి. స్వర్గమెందు కంటాడు రాముడు సోదరునితో స్వభావ సుందరంగా-

కన్నెలు కన్నెలేయగుచు గల్పము లేగిన గాని, తల్లు లౌ
టన్నది లేనె లేని యపు, డందరు నొక్కటెగాని, పెద్దలుం
చిన్నలటంచు లేనపుడు, బింబము కుం బ్రతిబింబమంచు లే
కున్నపుడింక స్వర్గమది యుండియు నేమి ఫలమ్ము లక్ష్మణా!

తిక్కన గారు చెప్పినట్లు 'అలతి అలతి తునియల కావాళసంధించి' నట్లున్నదీ కైత. ఎందుకయ్యా పాదులకలపై నీ అభిమానం! పోతే చేయించుకోవచ్చు కదటయ్యా! అంటాడు సస్నిగ్ధంగా.

ఉదయము నిత్యమీవు శిరసొగ్గెడి పాదుక లౌట చేత, నీ
మది కవియన్న జాల నభిమానమె! యందులకే నటయ్య యీ
వ్యధ; తిరుగన్ రచించుకొనవచ్చును భాగ్యమె! లేక బంగరో!
కొదువయె యీ యరణ్యమున కొయ్యయునుం గొణతమ్ము లక్ష్మణా!
సంభాషణ శైలతో నడిచిందీ ఘట్టము.

కవికి జాలి వేసింది లక్ష్మణుణ్ణి చూచి. ఆయనే మాట్లాడతాడు లక్ష్మణునితో.

వలపున కచ్చుపున్ మొగలివంటిది నీ చెలి, నీవు భోగి మం
డల మకుటాయ మానుడవు, నైజముగా నవకామ యౌవనో
జ్జ్వలత క్షణక్షణంబును బొసంగును నాగకులంబు, కెట్లు రా
గలిగిగితి చుట్టవేసుక సుఖంబుగ ప్రొద్దులు పుచ్చుకుండగన్.

ఆలోచించే కొద్దీ అమృతం కురిపించేది యీ పద్యం. ఇట్లా ప్రతి పద్య రసాస్పదంగా ప్రవహిస్తుందీ కవితా వాహిని, ధారాశుద్ధితో. ఈ సంపుటిలోనే యోగపరంగా రామ దూతపై పద్యాలున్నాయి. మచ్చునకు-

నాదసుధన్ క్రమోప శమనమ్మయి పోయిన యట్టి క్షుత్ పిపా
సాదులతో శతాబ్దులు శతాబ్దులు యోగసమాధి నుండి, ము
న్నాది ఋషీశ్వరుల్ ప్రకృతి కావలనిల్చి, త్రికాల వేదులై
యేది ధ్వనింప జేసిరదె యీశ్వర వాణి సుమా! కుమారకా!

శబరి **(1951)**: మాధవపెద్దికైలాస వాసియైన పిమ్మట ప్రచురింపబడిన ఖండ కావ్యం. ఇది మధుర భక్తి పేటిక. ప్రసన్నతా దంతురితమైనది. రామాయణమనే ఇక్షుఖండాన్ని పిండి రస చషకాన్ని అందించాడు కవి. కావ్య స్వరూపం చిన్నదైనా కవితా సృష్టి మిన్న.

ఇన్నాళ్ళకిటయ్యా ఇటు వచ్చేది? పండు ముసలి దాన్ని. దూరపుచూపానదు. నీరాకకై కన్నులు కాయలు కాచాయి. ఎదురు చూడలేక అంటున్నది శబరి రామచంద్రుని చూస్తూ-

కృప యీ నాటికి! యేది నీదు నగుమో, మేదీ! యిటుల్ చూపు - దూ
రపు చూపానదు, రమ్ము డగ్గరకు, వార్ధక్యమ్ము మెండయ్యె! ము
న్నెపుడో రాలక నీ నిమిత్తమె సుమా! యేనింత కాలమ్ము భూ
మి పయిన్ నిల్చుట యెల్ల - జూడు మెటులన్ మేనెంత జీర్ణించెనో! (14వపుట)

అడుగల నొక్కటే తిరుగు డొటను పొక్కగ బోలు, పాదముల్
కడిగెడు వేళ జేతి కఱకాళులు నివ్వరి నూగొ యన్న కై
వడిత విలెన్ రఘు ప్రవర! వానిపయిన్ హిమ మిశ్రితమ్ము కా
బడిన పటీర చర్చయిడి, పట్టెదు నీ సురటే నొకింతగన్. (17 వపుట)

'శబరి విందు' అనే జానపద కవితలో సీతారామ లక్ష్మణులు వచ్చినట్లున్నది. అదియు నీకృతిలో ధ్వనింపబడినది. ఈ ఖండ కావ్యంలో ఆధ్యాత్మిక రామాయణంలోని భావాలు చోటు చేసికొన్నాయి. కలకండ పలుకుల్లా రుచులూరించే పద్యాలు కొల్లలు, ఈ రసరమ్య కృతిలో.

**బృందావనము (1937):** పాండిత్య, శైలీవిన్యాసాలకిది కాణాచి. 'ఆత్మబృందావనంబు నీయాగమమున కెదురుచూచుచు నున్న దోయీ మహాత్మా!' అంటాడు కవి. ప్రకృతి వర్ణన కొక మచ్చుతునక. నన్నయ సంస్కృత సమాసాల్లా - సుందర సౌదామనిలా వెలుగులు చిమ్మతాయి.

సురభిళమంద మారుత కిశోర పరీత వనీ లతా గృహాం
తర నవపల్లవ స్థగిత ధాళధళీక శిలా వితర్దికా
పరిసర నిస్వనత్ ప్రమదబంధుర కోకిల కీర శారికా
స్వర మధురామృత శ్రవణపారణ సౌఖ్యరసైకలోలలై.

ఇందులోనే 'శారదా వన విహారము' అనే ఖండ కృతి కూడ నున్నది. కమనీయ శృంగార రసవాహిక యీ కృతి.

అడుగిడిన యప్పుడెల్ల జవ్వాడు చుండ
బిడికిట నడంగి యడగని పేద నడుము:
విభుని కడకామె యరుదెంచి వెడలు హొయలు
కనుటె పో, కంటిలో పాప గలుగు ఫలము.

ఉత్ప్రేక్షోపమలతో నిండిన రచన. అన్నీ నూతన కల్పనలే. రచనా శిల్పము ప్రతిభాపూర్ణమైనది. పాడి పాడి తేట తెనుగు మాటలతో కవిత నెట్లా నిర్మిస్తాడో, సమాసనిబిడ రచనా అంత హేలగా చేయగల కవి.

సాయంకాల సముద్రతీర కృత సంచారంబునం గల్గు స్వ
ర్గీయా నందము చూర గొంచు, నపరాద్రి ద్యోత మానారుణ
చ్ఛాయా కల్పిత చిత్ర వర్ణయుత శశ్వన్నృత్య దూర్మిచ్ఛటా
గేయా కర్ణన భాగ్య ముం గనని వ్యక్తిం జూడ బో మప్పురిన్.

**సతీస్మృతి:** అర్ధాంగి పోయినపుడు 'స్మృతి' కావ్యం రచించినాడు. అంతకు కొన్ని దశాబ్దాల ముందు వ.సు. రాయ కవి 'సతీస్మృతి' పేరట కరుణ రసనిర్భరంగా స్మృతి కావ్యాలు రచించినాడు. మాధవపెద్ది ఆకాశంలో చుక్కల నడుగుతున్నాడట తన చక్కని చుక్క ఎక్కడైనా కనిపించిందా అని.

మెడ పైకెత్తి యొకానొకప్పుడు శరన్మేఘంబులం గాంచి, నీ
పాడ నే మే నెరిగించునేమొ యని నే బుద్ధీంద్రియ క్షోభతో
నడుగన్ జూచెద మెన్నొ చుక్కల ననంతా కాశ మందైన, నె
క్కడ నీ చక్కని చుక్క గానమను సంజ్ఞన్ తెల్లవోవున్ సఖీ!

**ఉమర్ ఖయ్యాము(1944, 2వముద్రణ):** ఉమర్ ఖయ్యాము, తత్త్వధారను కవితా సౌందర్య ధారతో మేళవించి అపూర్వతను సాధించినాడు పార్శీభాషలో. దీని రుచికి లోగి తెలుగు చేసినవారిలో హరికథా పితామహ ఆదిభట్ల నారాయణ దాసు తొలుతటివారు. ఆ వెనుక, పార్శీ భాషనుండి అనువదించిన వారిలో ఉమర్ అలీషా కవి, దువ్వూరి రామిరెడ్డి ముఖ్యులు. ఫిట్జ్‌గెరాల్డు ఆంగ్లానువాదం ఆధారంగా తెలుగు చేసిన వారిలో రాయప్రోలు సుబ్బారావు, మాధవపెద్ది మున్నగువారు కలరు. 'మధువె కాని ముక్తి వధువు వలదని' న వాడు ఖయ్యాము. బహిర్వేషము అట్లావున్నా జీవిత సత్యాలను, సూఫీతత్త్వాన్ని ఇమడ్చకపోలేదు. అచ్చవెన్నెల కురిపించినట్లు తెలుగు పలుకుల తీయందనాలను వర్షించారీ కావ్యోద్యానంలో మాధవపెద్ది. సామాన్యమైన మాటలను, అసామాన్యంగా పోహళించినాడు బుచ్చిసుందరుడు.

తలపై నొక్కకపూవె రాలిపడుచుండన్, పైడి లేయెండ చు
క్కల నెమ్మేనుల గమ్మ తెమ్మెరల మొల్కల్, నీటి పన్నీటి చు
క్కల జిల్కన్ సరసీతటిన్ వకుళ వృక్షచ్ఛాయలో కెంపు జా
యల ద్రాక్షారస మారగింతము వయస్యా! భుక్త శేషమ్ముగన్

గంధము లప్పటప్పటికి గాలి యెటుల్ గ్రహియించి వీడు నో
బంధము నందు జిక్కియటె ప్రాణము తప్పుకొనంగ జొచ్చు ద
త్సంధిని మాత్రమే నెఱుగజాలకపోతి, నికేమి చెప్పు! ఈ
రుం ధనతోడనే గడచె రోజులు మాసము లేండ్లు పూండ్లనున్.
ద్రాక్షా రస సదృశమైన పద్యగుళికలే అన్నీ.

**మృత్యుంజయ శతకం:** ఈ రచన గూడూరి నమశ్శివాయ (విజయవాడ వైద్య శేఖరులు) గారి కోరికపై 'ఒక లంబోదరుడైన పుత్రకుడు' అని ఆషామాషీగా ఆరంభించి 108 పద్యాలు రచించుటైనది. హాస్యచతురత గలవీ, యోగసంబంధమైనవీ, లోకసంబంధమైనవీ పద్యాలున్నాయి. నిందాస్తుతి చేస్తూ శివుని పై ఒక పద్యం అల్లారు చమత్కార బంధురంగా.

మెడ నాగన్నకు నొక్కటే బుసబుసల్, మేనన్ సగంబైన యా
బిడతో నీకెపుడొక్కటే గుసగుసల్, వీక్షించి మీచంద మె
క్కడ లేనంతగ నొక్కటే రుసరుసల్ గంగమ్మకున్, నీ చెవిం
బడుటేలాగునొ మా మొఱల్ తెలియదప్పా! మాకు మృత్యుంజయా!

**శృంగార చాటువులు:** ఇది ఖండ కావ్యాల సంపుటి. ఇందులో సాయిబాబాపై చాటువులే కాక, శనిగ్రహము, ఆంధ్ర నాయకులు, రంగూను, జపాను, రాయలసీమ, గిరీశం, తూర్పు పడమరలు గూర్చి ఉన్నాయి. తన వంశం గూర్చీ, నాకరికత పైనా, తెనాలి పైనా ఇట్లా ఎన్నో చాటువుల కలగూర గంప యీ సంపుటి.

'రైటో రైటు తెనాలికే తగును లేరా! ఆంధ్ర ప్యారీసనన్' అంటాడొకచోట.
కాఫీ పై రుచులూరే చాటువు. పరికించండి.

పిక్కల్ పట్టుక పోవు ప్రొద్దుటను కాఫీ వచ్చి యీ గొంతునన్
గ్రుక్కెండయినను జారకున్న యెడ, నక్కొర్వడ్డ ప్రాణం బొగిన్
రెక్కొగా, నది నీదుభక్తతతికే నీబుద్ధి యెంతెంతగా
రెక్కొగల్గెను నీదునామ సుధకంటెన్ గూడ మృత్యుంజయా!

దేశ సేవలో పండిన ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులపై మరొక చాటువు.

లవ మాత్రమ్ము ప్రధాన సూత్రములపై లక్ష్యమ్ము పోనీయ, రు
న్నవ వారాంధ్రుల పాలి పున్నెముల పంటల్ వోలె, తద్దంపతుల్
శ్రవణింపం గను గొంటయే ఫలము, కంటన్ పాప యున్నందు కెం
త వయోవృద్ధత, యంతగా నవయుగత్వం బబ్బె నవ్వారికిన్. (పుట 54)

**సుభాషితము (1951):** ఇందులో సుభాషితము, విద్య, వృత్తి, సజ్జన దుర్జనులు, ఆత్మస్తుతి, వార్ధక్యము, పరాశ్రయము, శ్వశుర గృహము, క్షమ, కాలము, విధి, స్వభావము, కవి, హితోక్తి, వైద్యుడు, ధనము, భట్టు అనే శీర్షికలున్నాయి. బుచ్చి సుందర రామశాస్త్రి మనస్సన్యాసి, యోగసాధకుడు. అందువల్ల పారలౌకిక చింతనతో వ్రాసిన పద్యాలున్నాయి.

ప్రాశన కిన్ని యంబువులు షర్ణములున్ ఫలముల్ గదా! తపో
రాసులు బ్రహ్మవాదులు పరాశరదివ్య మునీంద్రు లీశ్వరా
దేశ మభి స్మరింపరె, శ్రుతి స్మృతి రూపము గాగ, మేషుగ
ర్జాశత ముక్తకంఠముల సర్వము యోగబలమ్మె వారికిన్.

సంఘంలో ఎగుడు దిగుడులు చూచి వ్యథపడ్డాడు. మానవుడూరకే కాలము వ్యర్థము చేయుచున్నాడని వందురినాడు.

తన యుచ్ఛ్వాసమె హంసలాగు హృదయ స్థానంబు నన్ నిల్చి, య
ల్లన జోకొట్టుచు నిద్రబుచ్చునటు లాలాపించు సంగీత ని
స్వన మాధుర్యము గ్రోలి కేవలము జీవన్ముక్తుడై పోక, యెం
దునకో! మానవుడూరకే గడపుచుండున్ కాల హాత్మేశ్వరా!

భారత జాతీయోద్యమంలో పాల్గొనని వారి నధిక్షేపించినాడు. నవనాగరకపు వెఱ్ఱిని అవహేళన చేస్తూ వ్యంగ్యధోరణిలో వ్రాసిన పద్యాలు తెలుగు వారిని మురిపించినాయి.

కనులన్ జూడదు భార్యయేనియును నీ కాలస్థితింబట్టి జ
ర్మను తైలమ్ము, జపానుస, బ్బమెరికా క్రాపున్, వియన్నా సులో
చనముల్, స్వీడను చేతి బెత్తమును, స్విట్జర్లండు రిస్ట్వాచి, ఫా
రెను డ్రెస్, ఫ్రెంచి కటింగు మీసలును, ప్యారిస్ ఫేషనే లేనిచో.

తెలుగు నుడికారపు సొంపు పెంపు ఈతని కవితలో కులుకుచుండును. జనవ్యవహారంలో ఉన్న పదాలు, వ్యాకరణ విధేయము కాకపోయినా ప్రయోగించిన నవ్యుడు. ఆంగ్ల, హిందుస్తానీ పదాలు ప్రయోగంచటానికి జంకలేదు.

మధురకవిగా ప్రసిద్ధుడైన మాధవపెద్దిని రాయప్రోలు, కాటూరి ప్రభృతులు సమకాలికులు గుణప్రశంస చేసినారు. ఈయనకు పద్య రచన ఒక పరమ మధురమైన హేల. భావన కూడా పరమ సుకుమారంగా ఉంటుంది. మధురంగా చిక్కగా తీయగా పద్యాలు కూర్చే భావకవులలో ఈయన విశిష్టుడు. ఇతని ఊహ, తెలుగుతనంతో పాటు, భారతీయతను పరిమళిస్తూంటుంది. కాటూరి కవి మాధవపెద్ది కవితా మాధురి కెత్తిన నివాళి గమనించండి!

పరమాశ్చర్యము నీదు శిల్ప రచనా ప్రాగల్భ్య మూహించినన్
దెర లొండొండ దెరల్చికొం చరిగి యుద్దిష్టార్థముల్ కండ్లముం
దర వెల్గింతు తటాలునన్ మెఱపు చందానన్ బళీ! బుచ్చి సుం
దర! నీసుందర సూక్తి మాధుకణ బృందస్యంద మగ్గింతురా!

# వేణీభంగము

'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ

(ఒక మిత్రుని గృహమున ఆశువుగా చెప్పబడినది.)

అది రాజసూయ మహాయాగ పుణ్యావ
బృథవేళఁ దడిసి పెంపెసఁగు వేణి
ద్రుపద భూపతి యజ్ఞధూమంబు వెం
బడి బాహిరిల్లిన చలద్భ్రమరవేణి
అతిరహః కేళి మహావీరుడగు ధనం
జయుని హస్తస్పర్శ సాగువేణి
అతి దివ్య కుసుమ మాలాతి మంజుల
మనోహరు నల్లని త్రాచునైన వేణి

ఈమహాదుష్టుఁడది యటే యింతమంది
కూరుచుండిన సభలోన గొంకు లేక
తగుదునని ఘూతయోగ్య హస్తమున లాగి
తారుచున్నాడు గురు సన్నిధాన మందు. 1

ఇతడేమి కులవృద్ధు సతి నేకవస్త్ర
సంసత్తున కీడ్చి కేశములు పట్టి
లాగగాఁ జూచి బేల విధాన, కన్నులు
లేని వాని విధాన, హీనుఁడైన
వాని విధాన, నీవర కొక్కమాటయు
లేకుండ మౌన మలీమసుండు
కూరుచున్నాడని కోరి నిందించి రె
ల్లరు బాహ్లికుని భీష్మతరుణ మెఱిఁగి

అన్న కనుసన్న దుర్వర్గ మతిశయించు
దర్పమున యువరాజు హస్తంబుఁ జూచి
ఒక యనూహ్య దుర్వర్తన మొనరజేయ
బోవఁగ వృకోదరు డు క్రోధమూర్తి యగుచు 2

తన చెంతన్ గజతుండ వైఖరి గదాదండంబు దీపింప, బో
రన నేత్రాంత వమన్మహోగ్ర కలితోష్ణానేక రక్తాంశువుల్
ఘనమై క్రమ్మగ లేలిహానమన నుగ్రంబైన పెన్మూర్తితోఁ
గనుఁగొన్నన్ యమసూతి కంటితుద యాజ్ఞం బెట్టె శాంతాకృతిన్. 3

కని యతి దీనమైన గతిఁ గన్నుల నీరముపెట్టి చూచె న
ర్జునుఁడు వృకోదరున్ హృదయ శోకము లోపల కోపమెంతయున్
మునుకలు వెట్ట, వాడు పడిపోయిన తామరరేకు లట్లుగా
దన కనుదోయి భూమిపయిఁ దార్చె వృకోదరు డున్ గ్రమంబునన్. 4

ఆరీతి సభలోన నతిశోకమూర్తి
బాంచాలి వివస్త్రగా సలుప నెంచ
దుశ్శాసనుఁడు మహాధూర్తుండు కుల
గురుద్రోహియు పాపకర్ము డు కుటిలుఁడు
ఒకరైనఁ గాదన రొకరైన నిదియేమి
పాడియటంచుఁ జెప్పరు, ధనాధి
కుండు చేసిన చేతకును నౌనుఁ గాదని
చెప్పఁగలాడుఁ దాక్షితినిఁ గలఁడె?

ఇది మహాద్రోహమని సురలెవ్వరైన
మింట ఘోషించు చున్నారొ, మెఱసి దివ్య
మైన జ్యోతిస్సు వెల్గెనొ, ఆరిపోవు
నొక్క వేళకుఁ గొడి గట్టుచున్నదేమొ! 5

వారు దిగంతమున్ ధరణిపాలుర నొంచి మహాప్రతాప రో
చీ రుచిరాకృతిన్ మిగుల జేవురు దీపిక లెత్తినారటే!
తీరని కాంతులన్ గళిత తేజులు ఘోరతమశ్ఛటా ముఖాం
భోరుహులై పృథాసుతులు మోసము పొంది రిదేలొ పండితుల్ 6

తన విలోచనములఁ దనరు వైశాల్యంబు
మించు శోకమునఁ గుదించు కొనియె
తన మూర్తిలో ధగద్ధగితమౌ తేజంబు
కలిత బాష్పప్లుష్టమలినమయ్యె
తన యవయవములఁ దనరారు దర్పంబు
జ్వర హీనమగు గతి సాగిపోయె
మూడులోకముల నిమ్ముగ నానవెట్టు
నిజోన్నతి యొక మూలనొదిగిపోయె

దించుకొని పోయెనేల యౌధిష్ఠిరాగ్ని
యిది యటే మున్ను నుండి యహీనమైన
దిగ్దిగంతాంతరముల సంధిల్లపేర్చు
కొన్న శాత్రవ ధృతి నార్చుకొన్నదోటు? 7

ఒకడెకా! లక్క యింటికిఁ జిచ్చు ముట్టించ
భుజమున మోచి సముద్ధరించె
ఒకడెకా! బకుని నెమ్మికు నెమ్మిగాఁ జీల్చి
సంధిసంధికి మధ్యఁ జావమోదె
ఒకడెకా! చండ బాహాగ్రదండ ధ్వస్త
ధిక్కృత హైడింబ దేహయష్టి
ఒకడెకా! యెవని పేరికి భయంపడి
ధార్తరాష్ట్రులు దూషిత త్రాసులైరి
ఆ వృకోదరుఁ డీ నాఁడు స్వాకులందుఁ
దొంటి గాంభీర్యరేఖ నిర్ధూతమైనఁ

దల చిదుకఁ ద్రొక్కబడు కోడెత్రాచు
వోలె నంగ మంగమ్ము కదల కిట్లా భ్రమించు? 8

అటఁ గృష్ణుఁడఁట వీరుఁడట నితఁడట యౌర!
ఎంత హైన్యంబుఁ దానేచు కొనియె!
విజయలక్ష్మి మహావేశ పరిష్వంగ
రమ్యంబు వాని యురంబు నేఁడు
గళిత తేజోరాశికరణిఁ గన్పట్టునే
లా యెంత దుష్టవేళా విపాక
మితఁ డొక్క పెట్టున నెత్తిన మత్స్యనా
మక యంత్ర భేదన చకితమైన

దృష్టిఁ బరపిన నాఁడు హరింప బడియెఁ
బో జగంబులు నేఁడు విభూతి లేకఁ
దొంటి విప్పారు లేక ముక్కంట నగ్ని
చల్లబడినట్టి శంకరు చాయఁ దోఁచు. 9

అతి సాహసమున కుదాహరణంబులు
మేలి యందాల దేహాలవారు
మాద్రీ మహాదేవి మధుర గర్భంబున
బండించుకొన్న క్రాల్పంట చేలు
ఆజానుదీర్ఘ బాహారమ్య వక్షులు
ప్రాతర్వికాస నీరజ దృగంతు
లమృత మూర్తులు మనోహర చారు కోదండ
గంభీర హస్తులు కాంతి యుతులు

వీరటే కవల్ తమ యెట్టపెదవులందు
పంటి నొక్కుల రక్త మేర్పరుపఁ బడక
దృగుదిత క్రోధవహ్నులు దృగ్నిరుద్ధ
క్రోధ వహ్నులు నెంత విఘూర్ణులైరి! 10

ఇవియైదు సంభ్రమములు నీ
నవభంగ తరంగ మెడలినన్ ఘటితంబే
యవుబో! లోకము కట్టగా
చిదికి తడిసి జీర్ణజీర్ణ శిథిలంబెయగున్. 11

ఈ మహాశుశుక్షణి బడి యెంతదాఁకఁ
బ్రాణములు నిలబెట్టుకో యతన మింక
జేయుదురొ! ధార్తరాష్ట్రులిస్సీ! యటంచు
వనరి పోయిరి చూడవచ్చిన జనంబు. 12

ఈ యెడఁ బాండవాగ్ని రగిలించెడు ద్రౌపది యున్న యా సభన్
మాయురె! రాజరాజు సుకుమారత చూపు విలాసమేచు కం
దోయి సగంబు మూయుచుఁ గనుల్ రసికత్వము వెల్లడించు గంటే
యమదండ రీతి భ్రుకుటిన్ నటియించును భీమసేనుఁడున్. 13

ఒక్కట సద్దుఁ గల్గక ముహుర్ముహురుత్థ సభాజనోగ్ర స
మ్యక్కృత దీర్ఘ నిశ్వసితమై యిరులెల్లెడఁ గ్రమ్ముకొన్న యే
యొక్క నిశాంత వేళఁ జటులోగ్ర తరంగ నినాదమై కడుం
బొక్కెడు నీరరాశి వలెపో! సభ భీకరమయ్యె నయ్యెడన్. 14

అప్పుడు రాజరాజు మధురాకృతి మిత్రునిఁ గర్ణు బిల్చి 'యో
యప్ప! విలాసినీ మణి సుమా యిది!' యన్న విధాన కన్నుదన్
విప్పి యొకింత మూసెఁ గనిపించెడు వైఖరి యాజ్ఞసేనికిన్‌రొప్పుచు
భీమసేనుఁడు విరూప విలోచనుఁ డర్ధి కాంచినన్. 15

అది కని దండ తాడిత మహాభుజగాకృతి రోషభీషణో
న్మద భయదాకృతిన్ కనుల దమ్ముల కెంపుల గుంపు గీటుకో
బొదలిన ధర్మసూతి కనుమోపల వెంబడిఁ బంచునాజ్ఞ యొ
ప్పిదముగ వెంట వెంటఁ దలపించిన దాతనికిన్ మనస్సులో. 16

తన సింహాసనమందు నోరిగిలి నేత్రంబుల్ విలాసంపు సొం
పున దీపింపఁగఁ గౌరవేశ్వరుఁడు నింపుల్గుల్కఁ బాంచాలి పై
పునకున్ దృష్టి నిగుడ్చి దక్షిణ కరంబున్ సాచి రమ్మంచు న
ల్లన సన్నం బొనరించె నూరు తటి మెల్లం దాకుచున్ గోళులన్. 17

అది చూచె దూరమున ను
న్మద మూర్తి వృకోదరుండు మత్తాహిత ని
ర్మథన కళాచణ భీషణ
గదాకలిత హస్తపద్మ గంభీరుండున్. 18

తన విలోచనములు చలత్తారకలును
రౌద్ర రేఖా నిరూఢి సంరక్తములుగ
బలికె నీగతి సభలోని వారికెల్ల
గుండెలో నెత్తురుల కాల్వ గూడుకట్ట! 19

ఇదె రిపులోక భీకర మహీనము నేను ప్రతిజ్ఞ చేసెదన్
మదమున మాకుటుంబినిని మామక యూరువు నెక్కుమంచు నే
యధముడు సన్నఁజేసెఁ గలితాస్మదుదార కరాగ్రవర్తి యీ
గద మొనచేఁ దదూరువును ఖండితముం బొనరింతు నాజిలో 20

రక్షోభీకరు నన్నుఁ జూచి ధరణీరాజుల్ భయంబందఁ ద
త్కుక్షింబ్రేవులు పెల్లగించి సమరక్షోణిన్ విజృంభించు ర
క్తాక్షున్ నన్నును జూచి యేడ్చుదరులే కానిమ్ము కౌరవ్యు లీ
దీక్షాక్రోధ భయంకరాకృతి సమర్థింపంగ నెట్లోర్తురో! 21

(సశేషము)

(సేకరణ: డా. ముదివేడు ప్రభాకరరావు, తిరుపతి).

# కింకవి గజ సింహం

–దుగ్గిరాల రామారావు

రమణీయమైన గీర్వాణభాషాయోష
పొత్తిళ్ల బెరిగిన ముద్దులయ్య
అతులమాధుర్య ధుర్యాంధ్రవాఙ్మయవాణి
లాలించి పెంచు గారాల బిడ్డ
బ్రహ్మయ్యశాస్త్రి సత్పాండిత్యమరయంగ
నచ్చుగుద్దిన మంచి మచ్చుముక్క
కవనహేమమ్మందుఁ గలితీనిఁ గనిపెట్టు
నీటైన వాటంపు గీటురాయి

కుకవిమత్తేభ సంఘమ్ము గుండెలదర
సంచరించిన వీర పంచాననమ్ము
సత్కవీశుండు వేంకట శాస్త్రి గురువ
రేణ్యుని పదమ్ములకు నమస్కృతులు నుతులు.

గోణము గట్టకుండఁ గనె కోమల సత్కవితా సతీమణిన్
రాణిగ జేసికొంటివి; కలంబను కుంచియతోడఁ గ్రొత్త పా
రాణినిఁ దీర్చిదిద్దితి సరస్వతి కాళ్లకు నాంధ్రదేశ ది
క్కోణములందు నాశుకవి కోకిలవైతివి; లేరు త్వాదృశుల్.

ఆరయ సత్సభాంతర సమగ్ర వధాన విధాన మందసా
ధారణ ధారణాపటిమ ధారణతోఁదులతూఁగు పాండితీ
ధోరణి పాండితీ బలముతో జతయై విలసిల్లు, వాక్చమ
త్కార విలాసమున్ భవదుదారగుణమ్ములు వేంకటేశ్వరా!

అరమర లేక జంటకవులై యవధానము లాచరించుచున్
సరస వచోవిలాస విలసన్మధురాశుకవిత్వ మల్లుచున్

తిరుపతి నీవు మిమ్మెదిరి నిల్చిన పండితులన్ జయించుచున్
దిరిగిన రోజు లాంధ్ర ధరణిన్ స్మరణీయములైన పర్వముల్.

ధవళేశ్వరము నందుఁ జెవియొగ్గినవి కదా!
నిండు కొబ్బరి తోటనుండు చెట్లు
వెంకటగిరిలోఁ జివిర్చి పూచెనుగదా!
మోళ్లతోడను బండ రాళ్ళు గూడ
గద్వాలలో గడగడ వడంకెను గదా!
నిక్కి నీల్గిన యా శనిగ్రహమ్ము
ఆత్మకూరున సెబాసని మెచ్చుకొనెఁ గదా!
ప్రతిపక్ష పండిత ప్రతతి కూడ
తిరుపతియు నీవు జతకూడి తెనుఁగు నందు
సంస్కృతమ్మునఁ జెటియొక చరణముగను
ఆశుధారా కవిత్వమ్ము నల్లునపుడు
చెళ్ళపిళ్ళ కులాంభోధి శీతకిరణ!

ఆంధ్ర సంస్కృత వాఙ్మయముల మేమే కవీం
ద్రులమంచు మీసము దువ్వునాఁడు
సకలదేశాధీశ సంస్థాన సభలందు
నాశుధారను గైత లల్లునాడు
వెకిలి ప్రశ్నలు వేయు కుకవి గుంపులఁ బట్టి
గట్టిగాఁ బండ్లూడఁ గొట్టునాఁడు
శతవధానమ్మను సర్కస్సు ఁజూపించి
ప్రేక్షకావళిని మెప్పించునాడు

నీదు కవితాప్రవాహమ్ము నీదు ఠీవి
నీ జమత్కార వాగ్ధాటి నీదు పాండి
తీ బలమ్మును గనుగొన్న తెనుఁగు వారు
చెప్పుకొందురు కథలుగ నిప్పటికిని.

పసరు మొగ్గల నిగ్గుఁ గసరి కొట్టఁగ జాలు
నాజూకు కైతపై మోజు చూపి
పట్టుఁదేనెల గుట్టు మట్టు బైటను బెట్ట
దగుసుతారపుఁ గావ్యతతులు వ్రాసి
అమృత భాండముల కాండములపై దండెత్తు
మధురాశుకవన సామ్రాజ్యమేలి
కలకండరుచులతో బలిసి కుస్తీపట్టు
దృశ్య ప్రబంధాలు సృష్టి చేసి
కన్నుఁదెఱవని బుడుతల కడుపులందు
నూరిపోసితి సత్కవితారసమ్ము
ఏమి కవితా ప్రభావమో యేమొకాని
కవుల సృష్టించి నావు వేంకట కవీంద్ర!

తిరిగిపోయిన దీని గొఱిగించెద నటంచు
దొడ్డ మీసముఁ బందె మొడ్డినావు
ఓడిపోయినఁ బాదయుగము మ్రొక్కెదనంచు
వాసిగా శపథంబు చేసినావు
గురుఁడన నేల శంకరుఁడైనఁ గాదన్న
వాదింతునని పట్టుఁబట్టినావు
కవనార్థమై భూమి నవతరించితినంచు
కడుధైర్యముగఁ జెప్పఁగలిగినావు
సరసకవితావధూటి నాసొనియంచు
జెట్టివయి దిట్టముగ సవాల్ గొట్టినావు
ఎన్ని ప్రతినలు పట్టిననేమి? తుదకు
మాట నెగ్గించుకొంటి వామాట చాలు.

మరుని తూపుల రూపుమాపు చూపులకోపు
కలవాలుఁ గంటి బింకాలు మాన్పి

చందమామకు మధ్యఁ గందంచు నిందించు
బాలమోమునకు నందాలు నేర్పి
కటికి చీకటుల పొంకమ్ము సుంకమ్ముగాఁ
గొనువేణి గలదానిఁగనికరించి
క్రొంగ్రొత్త మల్లెపూగుత్తి మెత్తఁదనమ్ము
తనరు పూఁబోణి మై నునుపుదిద్ది

రాజు కవిరాజు పండిత రాజు మొదలు
పామరులఁ గూడ రసపరవశులఁజేసి .
వాసికెక్కెను వాణికి వాణివైన
వేంకటకవీశ్వరా! నీకవిత్వవాణి.

ఎనుబదియేండ్లు దాపయిన వృద్ధుఁడవైన గవీంద్రచంద్ర! క
మ్మని కవనాలు చిమ్ము సుకుమారపు లేఖిని నాపకుండఁగా
దినమున కొక్క గ్రంథమును దీక్షగ వ్రాసెదవౌర! వంగిపో
యిన నడుమున్ బిగించి, పరమేశ్వరి యండగ దండనుండగన్.

ముట్టకయున్న వ్యాకరణమున్ బదియైనను గాని కంఠతః
పట్టకయున్నఁ బూర్వకవిపద్యములన్ గవులై కృతుల్ రసం
బుట్టిపడన్ రచించ మదినుత్సుకతన్ గనువారికెల్ల మీ
పెట్టిన భిక్షయే యమృత భిక్షకదా! కవిరాజశేఖరా!

చేరువ కేగుదెంచి తమ సేవలు చేయగ లేనివారు మీ
పేరు జపించినంతనె కవిత్వ లతాంగి యలంకృతాంగియై
వారలచెంతకున్ వలచి వచ్చునఁటన్న యనన్య సాధ్యమౌ
పేరుగడించి భోజు మఱపించితి తిర్పతి వేంకటేశ్వరా!

(1949 లో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారికి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ఆంధ్రాస్థాన కవి పట్టప్రదానోత్సవ సందర్భమున వ్రాసి, స్వయంగా వేంకటశాస్త్రి గారికి వినిపించిన పద్యాలు)

# రెండు పడవలు

-దర్భశయనం శ్రీనివాసాచార్య

ఒకే పడవలో పయనించాలని
మిత్రమా!
నువ్వూ నేనూ కోరుకునే వాళ్ళమేమో
కానీ మనం పడవలెక్కక మునుపే
ఒక తీరంలో కలుసుకోలేక పోయాం కదా
తీరా చూస్తే వేర్వేరు పడవల్లో
ఒకరికొకరం తారసపడ్డాం ఎంతో కొంత యాత్రించాక
అన్ని దూరాల్నీ దగ్ధం చేసి
ఒక్క దగ్గరి తనాన్నే అందించే దాన్ని స్నేహమందామా
మిత్రమా, పడవలు దగ్గరై స్నేహమయాం
ఇంత స్నేహకాంతిలో దూరం లేదని ఎంతనుకున్నా
పడవల నడుమ అపుడపుడు అలలెగిసి
నిజదూరాన్ని అంతో ఇంతో గుర్తు చేస్తుంటాయి
ఐనా కలుసుకున్నంత దగ్గరగా సమాంతరంగా
పడవలు కదులుతున్నపుడు
రెండు కళ్ళ ఉమ్మడి పర్యటనలో ఒక దేహం కదిలే
సాదృశ్యం గుర్తుకొస్తుంటుంది
పడవల సమాంతర స్నేహయానం రెండు ఆత్మల ఏక స్వప్నం
ఒక్కోసారి ఆత్మల స్వగతాలు స్వప్నాలు చివుక్కున చిట్లుతాయి
బతుకు అవసరంగా అన్నట్లు
స్నేహస్వప్నాల్నీ వదిలి దేహమపుడపుడు ఎటెటో
దూరయాత్రలకు వెళ్ళక తప్పదు పడవను బరబరా లాక్కుంటూ!
అలలు బావురుమని టపటపా కొట్టుకుంటాయి
తిరిగొచ్చే ప్రయాణమని తెల్సినా దూరం రంపంకోతే!

మిత్రమా! ఇపుడు నీకూ నాకూ నడుమ
ఒక వారం విరామం
నువ్వొదిలి వెళ్ళిన చూపు కొసకు ఈ వారం వేలాడేదా
కానీ సూర్యసంగీతమో అలల యుగళ గీతాలో
ఆకాశ సౌందర్య దీప సందేశమో మానవ సామూహిక సంతోషమో
ఒంటరి పడవల ఏకాంత దుఃఖమో చీకటి రేఖల లేజర్ కోతలో
ఏవి ఆగుతాయి చెప్పు కానీ చెప్పుకునేందుకు ఎక్కడో నువ్విపుడు?
జడంకాని జీవితంలో
ఏ సంభాషణా ప్రవాహం లేక ఏది కదలిక?

* * *

మిత్రమా
దూరాలే దగ్గరితనాన్ని గొప్పగా గుర్తు చేస్తాయి
ఐనా పడవను కదపుతున్నాను
కదలిక లేని చోట స్నేహం బతికేదెట్లా

* * *

వారం గడవదా
నీ పడవ తిరిగొచ్చి రెండో కన్ను కాదా
అపు డీ వారం భారాన్ని మోసిన అసహన ఖడ్గంతో
ఈ విరామాన్ని నిర్దాక్షిణ్యంగా రెండుగా ఖండించనా
సగం సగంగా కదుల్తున్న జీవితం నిండుగా పూరణైన ఆ వేళ
అలలు తలలెత్తి రెండు పడవల్లో ఒకే స్వప్నాన్ని దర్శించవా.

* * *

# కాలం మాయాజాలం

-జె. బాపురెడ్డి

కాలాన్ని జీవితం చేస్తే
చితికి పోతున్నది
మృత్యువు చేస్తే బ్రతికిపోతున్నది
మట్టిని చెట్టు చేస్తుంది కాలం
చెట్టును మట్టి చేస్తుంది కాలం
శూన్యంలో నుంచి అన్నీ సృష్టిస్తుంది
శూన్యంలోకి అన్నిటినీ నెట్టేస్తుంది
గ్రహాలనూ, నక్షత్రాలనూ
నిశ్శబ్ద సూత్రాలతో
నింగిలో వ్రేలాడేస్తుంది
కాలం
అందరితో దోస్తీ చేస్తుంది
అందరితో కుస్తీ పడుతుంది-
కాలానికి కళ్ళులేవు
కాని నిరాకార రూపాన్ని కంటుంది
కాలానికి చెవులు లేవు
కాని నిశ్శబ్ద గీతాన్ని వింటుంది
కదలని మొదలని కాలం
అన్నిటినీ కదిలిస్తుంది
మార్పులు చేర్పులు లేని కాలం
అన్నిటినీ మార్చేస్తుంది
ఇన్ని గారడీలు చేస్తున్న కాలం
అన్ని రహస్యాలూ చెపుతుంది
తన రహస్యం తప్ప

అన్నిటిమీదా అధికారం ఇస్తుంది
జనన మరణాల మీద తప్ప
అన్ని హక్కులూ ప్రసాదిస్తుంది
తనను ఎదిరించే హక్కు తప్ప.

* * *

## బహిరంగ స్వగతం

విత్తనమ్ము నౌచు - వృక్షముగా మారి
ఆవరింపదలతు ఆకసమ్ము
వీలు కాని యెడల - వేరు విత్తునకైన
ఎరువునగుటకేను ఇచ్చగింతు.

పాఠశాల లేక - ప్రథమ వైద్యము లేక
బస్సు లేక - మంచి బాట లేక
త్రాగునీరు లేక - గ్రంథాలయము లేక
ఒక్క ఊరు కూడ ఉండరాదు.

నమ్మకమ్ము లేదు - నాకేమతము మీద
అయిన గాని నేను ఆస్తికుడనె
మొదలు తుదయు లేని మూలశక్తిని మెచ్చి
బ్రదుకగలను అహము విడిచి పెట్టి.

మతము కులము లేదు - మనసు లోపల నాకు
లేవు - దేశభక్తి - దైవభక్తి
కొంత మమత గలదు - గుప్తదానము మీద
కవిత మీద లలిత కళల మీద.

-నందూరి రామకృష్ణమాచార్య

# పద్యకవీ! కోపించకు

–పేరాల భరతశర్మ

పద్యమొ గద్యమో వచన పద్యమొ వ్యంజకమైన శబ్దమే
ఆద్య కవీంద్ర మార్గమున నాదరణీయము సారహీనమౌ
పద్యము నిల్వదెన్నటికి; పామరుడా! అనవద్య హృద్య ప
ద్యద్యుతికై తపింపుమ! రసాత్మనెఱింగి వచింపుకైతలన్.

చక్కని పద్యవిద్యయు రసజ్ఞత యొప్పిన వారి నెల్లరన్
ప్రక్కకు నెట్టివైచెదవు, పట్టవు పూర్వ మహేంద్ర కావ్యముల్
చక్కని సంస్కృతమ్మును రుచింపదు నీ కనవద్య హృద్య మౌ
వాక్కు ఘటిల్లు నెట్లు? ఇక పద్యము జోలికి పోవనేలనో!

గణములు ప్రాసలున్ యతులు కావు కవిత్వ పదార్థమూలముల్
గుణము లలంకృతుల్ పద విగుంఫిత రీతులు వృత్తి మాత్రముల్
గణనకు రావు కైతలుగ - కాంత రసార్ద్ర హృదంత రాంతర
ధ్వని రణితమ్ము లేని పదబంధము ఛాందసమౌను మిత్రమా!

వచనము నందు వ్రాయదగు వాక్యము పద్యము నందు గూర్చుచో
పచనము కాదు, పద్యమున పండిన భావము పొంగులెత్తగా
రచనము సేయుటొక్క కళ, ప్రౌఢ మహేంధ్ర కవీంద్ర మార్గముల్
సుచరితముల్ రుచిన్ గొలుపు శుభ్రమనస్కుడవై గ్రహింపవే!

చేవ గలట్టి పద్యములచే రమియింపని వారులేరు స
ద్భావుక లోకమందు నొక పద్యము వ్రాసి జగత్ప్రసిద్ధులై
భావుక కోటికెక్కిన సుభద్రుల నెందఱ జూడలేదు. ఓ
భావుక! చచ్చు పద్యములు వ్రాయకు వ్రాసిన చచ్చుపద్యమే.

ఒక్కొక వృత్తమందు నొక్కొక భావము రక్తిగట్టు పెం
పెక్కిన భావ సంపద కవీంద్రుని గుండియ పట్టియుండు త
ద్వాక్కమనీయ వైఖరులు వానివిగా నుతికెక్కు నట్టి దౌ
ఫక్కి యొకింత లేని కవి పద్యము నోటికి పట్టదేరికిన్.

అతత పద్యవిద్యయది అక్షర శక్తిని పట్టియుండు సం
గీతము సుస్వరంబులను కేవలమోహన మౌను; అట్టి ఆ
పాత మనోజ్ఞతా మధుర పాతము మీసము పైని తేనెయే;
కైతయొ! అక్షరమ్ము - కవి కాలము దాటియు నిల్చు శక్తిచే.

ముత్యాల సరముల ముచ్చట గొల్పడే
అప్పరాయ కవీంద్రు డాంధ్ర భాష
కిన్నెర మీటి పల్కింపడే కైతలు
విశ్వనాథుడు రసవీథులందు
ఏ పాట పాడినా ఇంపుగా పలుకడే
రాయప్రోలు సుకవి రమ్యఫణితి.
సెలయేటి పాటల చెలువారు బాటల
కీర్తిగాంచడె తాను కృష్ణశాస్త్రి

పదపదంబున రసములు పరిఢవిల్లు
జానపదుల గానంబులు సాగలేదె
ప్రాణ వంతమైన కవిత పట్టినంత
ఛాందసంబులు పట్టవు జగతిలోన.

* * *

# రవి కిరణం ఆర్డర్ కాటన్

## జంగా గాంధీజీ ఆంగ్ల రచనకు తెలుగు అనువాదం

- యస్. సంజీవదేవ్

శరత్కాలపు
శశి
స్వర్ణజనిత
కాంతి
ప్రేమ ప్రసారిత
జ్వాలా
గులాబుల
సౌరభము
గుప్త గోదావరి
వినిపించే సరిగమలు
నిన్ను గుర్తుచేస్తాయి
ఓ సర్ ఆర్డర్ కాటన్!
నీవు ఈ విశ్వపు
ఉత్పత్తివి
ఈ బ్రహ్మాండమైన
ఆనకట్టకు రూపశిల్పివి
అదొక అద్భుత సాఫల్యత
కారుణ్యం
నీలో మూర్తిమంతమైంది
అనురాగం నీలో
ఆనందరాగమై మ్రోగింది
నీవు రూపాంతర పరచావు
సాధనను మానవతలోకి
దారిద్ర్యాన్ని సంపదలోకి
తిమిరాన్ని వెలుగులోకి
ఖేదాన్ని మోదం లోకి
నీ నిపుణతా సరస్సు
నీ భవిష్యత్ దృష్టి
నీ శ్రేయోకాంక్ష
నీ సారళ్యం

నీ విజ్ఞత
మొదలైనవన్నీ
రైతుల పాలిట
అయ్యాయి వరాలు
దీవి నుంచి దీవికి
అద్భుత హరిత అలంకారం
గౌతమిలోని
ప్రవాహం
వశిష్ఠ లోని
మధుర రవళి
వైనతేయంలోని
మహాశక్తి

పుణ్యస్నానాల
మంత్రోచ్చారణలు
విహంగ గానాలు
శ్రీమతి కాటన్
ఘనమైన పాదాలు
మొదలైనవన్నీ
నీ యుగాన్ని
స్మరిస్తున్నాయి
ప్రజలకు కాంతిమయ
ఆనందాన్ని
అందిస్తున్నాయి.

* * *

**There are only three things in the world :**
**one is to read poetry,**
**the other is to write poetry,**
**and the best of all is**
**to love poetry**

**- Rupert Brooke**

# ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు

- మల్లేల గురవయ్య

శ్రీ పింగళి లక్ష్మీకాంతోపనిషన్మధుర మంగళోజ్జ్వల వాణీ
గోపాయిత మర్మమ్ముల మాపాలిటి కింక నిత్య మననము లగుతన్॥

ఏమోయి యనుచు నెంతో ప్రేముడితో వారు పలుకరించెడి పిలుపిం
కీమహిలో వినగలమా! సామమధుర గీతి ప్రీతి చవిగొన గలమా!

జనవరి పది జననం బా జనవరి పదినాడె దైవసాయుజ్యం బీ
ఘనతరమగు సాధర్మ్యము జననము - మృతి ఒక్కటన్న సత్యము చాటెన్.

జననంబున్ మృతి ఒక్కటే తెలియగా సంసార చక్రంబు నం
దని నీవిచ్చట నొక్కిచాటిన ఋతం బాదిత్య సత్యస్థితిన్
జనలోకం బిల లోవెలుంగుల రహస్యంబున్ సమీక్షింప నౌ
నని భావింతు యథార్థ మీవెలుగుదో ఆచార్య! సూర్య ప్రియా!

ఇరువది రెండేండ్లకు మును పరిగితి దివి కిచట వంద అబ్దములయె; మీ
కిరువది రెండు దినమ్ములె జరిగినవో ఇవియె మీకు శతవర్షనతుల్.

ఆసౌహార్ద మనన్య దుర్లభము నిర్వ్యాజాను రక్తిన్ 'రసో
వైసః' సూక్తిని ఛాత్ర సంతతి యెడన్ వాత్సల్య రూపాన వి
ద్యా సౌరభ్యము తోడఁ జాటి రసవత్సాహిత్య సౌహిత్యమున్
వాసిన్ శిల్ప సమీక్షఁ దెల్పు రసభావజ్ఞా! శతప్రాంజలుల్.

**సప్తపది:**

తన తేజమ్మున తెల్గువెల్గులు జగద్బాంధవ్య లీలన్ జిరం
తనమై గ్రాలగ, శిష్యవత్సలత విజ్ఞానంబుగా' జాటి', నం

దనమౌ సౌందరనందముం దొలకరి స్నావించి కాటూరితో;
వెనుకన్ బండితరాజ మాత్మలహరిన్ వేడ్కన్ వినిర్మించి, వీ
డిన లక్ష్మీనరసమ్మ నిర్గమనమున్ డెందంబు పొక్కన్ వచిం
చిన మీ వాక్యములన్ స్మరించెదము లక్ష్మీకాంత! ఆచార్య వ
ర్య! నమోవాకము లివ్వె మల్లెల గురుత్వామోద భావాం (సభ్యాం) జలుల్!

* * *

## బహిరంగ స్వగతం

చాల నాళ్ళు బ్రతుకు - సమకూర్చెగా నాకు
పెక్కు అనుభవాలు విలువగలవి;
జగతి కిచ్చి నాను - చక్రవడ్డీ పేర్చి
పద్యరూపమందు భద్రపరచి.

గుండె గ్రుచ్చ - హాని గూర్చ బోవని కత్తి
హాస్యమన్న గొప్ప అమృత రసము
ఔషధమయి బ్రోచు ఆయురారోగ్యముల్
బహుజన హితమగును - బహుళ సుఖము.

చిత్రకారుడైన శ్రీ పికాసో చెప్పి
తాను గొప్పవాడు కానటంచు
యశము ధనము పదవి ఆర్జించు కోసమై
వెఱ్ఱి బొమ్మలెన్నొ వేసినట్లు.

శిష్యుడెవడు? భక్తి జిజ్ఞాస గలవాడు
అహము వీడినట్టి ఆర్ద్రహృదుడు
వెలుగు వెదకు కొనుచు నిలుచు తోడుగ సదా
పరమగురుడు శిష్యవరుడె నాకు.

–నండూరి రామకృష్ణమాచార్య

# వక్రించిన వర్తమానము

-అమళ్ళదిన్నె వేంకటరమణప్రసాద్

ఇది వక్రించిన వర్తమానము సదాహేరాళఘోరానలం
బుదితం బౌ జనమాన సాంతికము, రూపున్మాడ్చుకాళంబు, నీ
రధి కల్లోల పయఃప్రచోదిత మహోగ్రాకార తానౌటచే
నిది ఎప్పట్టున నేమి రూపమను ఊహే తాననూహ్యంబిటన్.

సముదీర్ణత్వము రూపుమాసెను ప్రశస్తారామముల్ - ఘోరమౌ
సమరక్షోణుల మాడ్కి కైదువుల వాసస్థాన భోషాణముల్
సముదంచద్ఘన సారభూరమ విలాస శ్రేణి లావణ్యమున్
దమి జూడంగ తలంచువారికట ప్రాణత్యాజ్యమే ప్రాప్తమౌ.

ఎన్ని ప్రజోపలాలితము లిచ్చుట కైనను సర్వసిద్ధమై
యున్న ప్రభుత్వదృక్పథము ఓర్వగలేని విపక్ష బుద్ధికిన్
కన్నులమంట; ఎన్నబడి గద్దెకు రానిస్వపక్ష జాతికిన్
ఖిన్నత; పీఠభద్రమున కెన్ని కుతంత్రములీధరిత్రి లోన్

ప్రారబ్ధంబని మిన్నకుండుట వినా ప్రత్యూహ మేముండె ఆ
ఘోరారణ్య మృగ ప్రవర్తకుల యుక్తుల్ మీరె, చంపించగా
సారా రక్కసి చచ్చి రూపరి పిశాచంబై ప్రకోపించి తా
వీరోచ్ఛృంఖల మత్తహేల సలిపెన్ వీథుల్ పిసాళించెడిన్.

ఒక మధురోహయున్ బొడమ దొక్క నిమేషము కన్ను మూసినన్
ప్రకటిత క్రోధపుంగములు, ప్రాభవచింత కుసంచితంబులున్
వికల మనః ప్రవృత్తి జరిపించెడి మారణహోమ తంత్రముల్
భ్రుకుటి వితర్ది పై నిలుచు; భూత సుఖానుభవంబు పై కొనున్.

సుందరోద్యాన వసుంధర పరదేశ
రిపుజన విషవనో(ద్రిక్త యయ్యె
వర్షముల్ గురియక పంటలెండుచు బోయె
ఆయుధ వర్షభయంబు పొడమె
(ద్రవ్యోల్బణము హెచ్చె; ధరలు పెరిగిపోయె
ముడుపులందరికిని ముట్టుచుండె
రక్షకనిలయంబు రూక్షాత్ములరుదెంచి
కడగినన్, పంచబంగాళమయ్యె
తమిళపులుల రుధిర తృష్ణ తగ్గుట మృగ
తృష్ణలోన తెలుగు గంగ తెచ్చినపుడె
ఈ సమస్త భారతమందిదే స్థితి - ఇది
వర్తమాన మహోద్వేగ భారతంబు.

(నన్నయ భట్టారక పీఠము, తణుకు వారు నిర్వహించిన 'పద్యకవితల పోటీ' లో ప్రథమ బహుమతి పొందిన కవిత.)

* * *

## చాటు పద్యం

కవులు విలువయైన కాలమ్ము వెచ్చించి
వ్రాయరాదు పెద్ద గ్రంథములను
చదువరులకు కూడ - సమయమ్ము వ్యర్థమౌ
చాటు పద్యమొకటి చాలు చాలు.

-నందూరి రామకృష్ణమాచార్య

# నాద మహిమ

- 'ఎలనాగ'

రేడియో గొంతులో
మెల్లగా రగులుకుంటున్న 'మారూ బిహాగ్' మీదికి
జర జరా పాక్కుంటూ వెళ్లింది హృదయం!
దుఃఖాన్ని గిలకొట్టి గుండెగోడలకు
చిక్కని సాంత్వనాన్ని పూసింది రాగం
అలల తల్పాల మీద
అలవోకగా తేలివచ్చే పూలరేకుల్లా,
చల్ల చల్లని గంధాన్ని మోసుకొచ్చే
పిల్లతెమ్మెరల్లా
స్వరాల వెంబడి స్వరాలు ....

నాపక్కగా ప్రవహిస్తూ
చప్పున నన్ను నీలోకి లాగి పడేసుకునే ఓ సంగీతమా!
నీ నాద మహిమతో నన్నాకర్షించే ఓ సూదంటు రాయీ!
నీలో మునిగి,
నీ స్పర్శతో మురిసి
తన్మయత్వంతో తనువు మరిచేలా చేసే
నీ సమ్మోహనత్వానికి జోహారు!

(ప్రభా అత్రే పాడిన 'మారూ బిహాగ్' విన్నాక-)

* * *

# బెంగుళూరు 'లాల్ బాగ్' లో ఓ సాయంత్రం

- పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం

ఈ నగరం ఎడారి మధ్య
ఒక ఒయాసిస్సు ఈ లాల్‌బాగ్
ఈ పుష్పవాటికలో
నగరం క్రమేణా పోగొట్టుకుంటున్న నిజాయితీ వుంది
ఈ తోటలో
నగరపు చౌరస్తాల్లో మనుషులు అప్పుడప్పుడూ
మరచిపోతున్న మానవత
మల్లెలు, మందారాలు, విరజాజుల్లా వికసిస్తున్నాయ్
ఈ సంక్లిష్ట జీవన వలయంలో
కొలను గట్టుపైకి విసిరేసిన చేపలా విలవిలలాడిన మనిషి
జిగీషతో ఈ తోట నిసర్గసంద్రంలో
మళ్ళీ ప్రాణం పుంజుకుంటున్నాడు
పుష్పవితతి నెత్తావీ
సిరిగంధపుచెట్ల పరిమళాలూ గుబాళిస్తుండగా
కదళి, మామిడి, జామ, సపోటా, సీతాఫలం చెట్లపై
విందు భోజనం చేస్తున్న రాచిలుకల రాచఠీవి
ఆర్జనను అధముడైన మానవుడి కర్పించి
నిర్లిప్తతతో చుడుతున్న సారంగ బృందం
ఎక్కడ చూసినా హాస వదనాలు
హలో, హలో, హాయ్, హాయ్
పరరాష్ట్రపు భాష అడ్డురాని
పలకరింపుల్లో సుస్నేహవీచులు

నవ్వులు, కేరింతలు
ఫౌంటెన్‌లలో ఎగజిమ్మే నీటిధారలా
ఆటలాడుకుంటున్న తమపిల్లల మొహాల్లో
ఉట్టిపడే జీవచైతన్నాన్ని
చిరునవ్వుతో వీక్షిస్తున్న పెద్దలూ, వృద్ధులూ.
ఈ సాయం సంధ్యలో ఈ తోట
పల్లెల్ని విస్మరించి వచ్చిన తన రైతు బిడ్డల్ని
వెదుక్కుంటూ వచ్చిన ప్రకృతి మాత హృదయంలా వుంది
ఈ ఉషస్సులో ఈ లాల్‌బాగ్
ఓ మనోహర దృశ్యకావ్యంలావుంది.

* * *

## పాండిత్యం

బహుళ కష్ట నష్ట భరితమైనది కదా
నరుడు మోయలేని బరువు - ధనము;
బ్రదుకు నందు - అరయ పాండిత్యమట్టిదే
హృదయమున్న మేలు చదువుకన్న

## మందహాసం

నిండు మనమ్ము - నవ్యనవనీత సమానము, పల్కుదారుణా
ఖండల శస్త్రతుల్యము - జగద్ధిత కాంక్షులన్ - విషాద్రమౌ
గుండియ తోడ గూడి సుమకోమల సుందర మందహాస వా
జ్మండను దుండవచ్చు సుషమా సుకుమార నటాభిరాముడై.

-నండూరి రామకృష్ణమాచార్య

# మననం ఉపశమనం కాదు!

- రాధేయ

నిప్పు మీద జొన్నకంకి చిటపటలాడినట్లుగా
ఎవడి సంఘర్షణ వాడిది.
కరెంట్ తీగ కాళ్ళను చుట్టేసుకొని జీవశక్తిని పీల్చేస్తున్నట్లుగా
ఎవడి సంక్షోభం వాడిది.
అంటుకోగానే భగ్గుమన్న ఎండు గరికలా
ఎవడి సంక్లిష్టత వాడిది.
అంతరాత్మల్ని కుదించుకున్న దీర్ఘకాలీన ఆత్మవంచనతో
కన్నీటి తడిలో ఆధునీకరించిన కష్టాలతో కలగలిసి
జీవితం పారదర్శకమవుతుంది!
చాకిరీ చేతుల్లోబడి చిల్లులు పడుతున్న వాస్తవాలన్నీ
ప్రమాద సూచిక దగ్గరే ఖననం చేయబడుతున్నాయ్!
అనుభవం బహుముఖమైనప్పుడు
మననం ఉపశమనం కాదు
చిరునవ్వు నగిషీలతో నిప్పు వూటల్ని దాచుకుంటూ
చిట్లిపోయిన జీవితాన్ని వాక్యాలుగా విరిచి,
పదాలుగా నరికి,
శరణార్థుల శిబిరాల్ని శిల్పంగా చెక్కుతున్నావ్
మనిషినీ, మనసునూ పిండుతున్న అందమైన నటనతో
ఎన్నాళ్ళీ చితి మీద జీవనగీతం?
జీవితమంటే --
'పెనమ్మీద పేలగింజ' కాదు
రాతికీ కత్తికీ మధ్య సంక్షోభ ధ్వని!

* * *

# కన్నులు ..... ప్రశ్నలు

- యస్. ముని సుందరం

ఒక్క లేఖలేదు.
అక్షరాల మెతుకులు తిని బ్రతికే నేను
ఆకలేసినా కేక లేయలేదు.
వాయిలేని కళ్లు చిల్లుకుండలవుతాయి.
రాత్రి బాగా నీరసించినపుడు
నువ్వు నా తలక్రింద దిండువవుతావు.
తుపాకీ గుండులా ఒక్కో జ్ఞాపకం
గుండెను పీలికలు పీలికలు చేస్తుంది
రాత్రి గడుసుపిండం. చంపదు.
తెల్లారిపోతుంది.
కిటికీలో కూర్చున్న వెలుగుబుల్లి
దోసెడు వెలుతురు పూలు చల్లుతుంది.
చూపుల్ని వుత్తరాల సంచికంటించి
నీ శ్వాస నిండిన పువ్వుల్లో గుండె పేలికల్ని
సమకూర్చుకుంటూ
కాలవిషాన్ని గుటకేస్తున్నాను.
ఇంతలో సంధ్య
వెన్నెల బాకు తీసుకొని వెంటబడుతుంది.
రాత్రి పక్షి ఒణికిపోతుంది.
ప్రేమ రక్తాక్షరమ్మై విలవిలలాడుతుంది.
నా గుండె కాగితం గాలి కెరటమౌతుంది
అక్షర క్షీరం కోసం
లేగ ప్రేమ పరితపిస్తుంది.
నీ వెన్నెల కన్నులు ప్రశ్నలౌతాయి.
మంచుదుప్పటి క్రింద ప్రకృతి మూల్గులు
అంతటా....కన్నులు.....ప్రశ్నలు

# మాష్టారూ! మీరంటే నాకిష్టం

- రాజేశ్వరీ దివాకర్ల

మాష్టారూ!
మీరంటే నాకిష్టం.
మీరు నా వెలుగు నేస్తం.
మొదటిసారి నే దిద్దిన
ఓంకారపు మెలికలలో
అక్షర రూపమ్మై మీరే అగుపించారు.
నా శారదా వర్షుకా భ్ర
సముపాదిత గగనాన
వెన్నెల గొడుగై నావెనుక నిలిచారు.
నామెదడు చీకటి విత్తనాలను
తెలికిరణమై
కరగించి వేసారు.
నా చెవులు
మెలేసారు.
గద్దించి, హెచ్చరించారు.
పాఠం ఒప్పచెప్పని నన్ను
బయటకు గెంటేశారు.
మీరంటే బెరుకు చూపే నన్ను
మీ తేనెగూటిలో బంధించారు.
ఎంత తీయని బంధం మనది
శిశిరం లేని ఆమని మనది.
అహం లేని తనువు మనది.
పరస్పర కీర్తి కాంక్షా
ముదిత హృదయం మనది.

అర్భకులైన
మీ కెన్ని తద్భవ రూపాలు!
ప్రతిరూపానికీ
మీ కన్నులలో
తత్సమాదరణలు.
బక్క చిక్కిన మీ కండరాలకు
ఎన్ని పుస్తకాల ఆవిరుల సెగలు!
మీరు నాటిన నందనాలకు
అవన్నీ చదవుల సిరిజల్లులు.
నాకు వర్ణమైత్రిని తెలిపారు.
వర్గ సమైక్యతను నాలో సంఘటించారు
తు.చ. తప్పని
ఉచ్చారణతో
నాలో నాదం మంత్రించారు.
నా బ్రతుకు
త్రిసంధ్యలో
మీరు చూపిన గమ్యానికి
చేరుకోవాలన్న
శాసనం మీది.
నే నడిచే దారిలో
మీ అడుగు జాడల
తడిని కళ్ళకద్దుకోనే
గౌరవం నాది.
అందుకే నా జ్ఞాపకాలలో
మరపురాని మూర్తిమీది.
మాష్టారూ! మీరంటే నాకిష్టం
మీరు నా వెలుగు నేస్తం.
(ఉపాధ్యాయ దినోత్సవ సందర్భంగా వ్రాసినది: 5.9.96)

# ఆత్మ దర్శనం

- అంబికా అనంత్

## 1. ఆశలు

నా ఊపిరి ఎగిరిపోయే లోపల
నా లోపల భద్రపరిచిన ప్రేమ వెలుగుల్లో
నిన్ను కాంతిమయం చేయాలని నా ఆశ
ఆ తడి ఆరని జ్ఞాపకంతో
ఈ జీవితం ముడివేయాలని నాఆశ
నిర్లిప్తంగా కదిలే ఈ గుండె
ఆఖరి చప్పుడు ఎప్పుడో తెలియదు
అంచులు లేని ఈ ప్రేమ సంచలనానికి
స్వస్తి ఎప్పుడో తెలియదు
ఆ రోజు రాక మునుపే,
నాఊపిరిలో ఊపిరివై
నా శ్వాసలో శ్వాసవై
పచ్చని క్షణాలకు ఆసరావైన నిన్ను,
ఈ శబ్ద ప్రపంచంతో పనిలేని
ప్రేమ నిశ్శబ్దంలోకి తీసుకు వెళ్ళాలని
ఆ సుస్థిర స్థావరంలో
ఆ అలౌకిక ఆనందంలో
ఆ వెచ్చని శాశ్వతంలో
వేరుగా నిలిచిన మనం ఏకమవ్వాలని
నువ్వేదో నేనేదో తెలియని ఆ ఏకత్వంలో
కాంతిధారల్లా కలిసిపోవాలని నా ఆశ
అలా

బ్రతుకు చీకట్లను
మరిచి పోవాలని నా ఆశ
నా ప్రాణమా....
చెమ్మగిల్లిన నా కళ్ళు
నీ కందించే సందేశాలు
ఇన్ని
నా ఆశలూ.....!

## 2. ముదిమితో పోరాటం

శిశిరంతో చేయి కలిపిన జీవితం
వడలిన వృక్షం లాంటి శరీరం
కాలగర్భంలో కలిసిన తీయని గతం
శాశ్వతంగా వలస పోయిన యౌవనం
సంకెళ్ళు పడ్డ స్వేచ్ఛా విహారం
అసమ్మతి ప్రకటించే ఇంద్రియ సమూహం
కవ్వంలా మథించే ముదిమితో
పోరాటంలో
గెలుపుకి, ఓటమికి అర్థం లేదు
చీకటి గోడల వెలుగు గది లాంటి
జీవన్మృత్యువుల జోడి
ఒక దాని వెంట ఒకటి ఉండనే ఉంటుంది
పోరాటంలో కాలయాపన చేయక
బ్రతుకు క్షణాల్లో వివిధ రంగుల పంటను పండించిన నీవు
ఏ దశకు తగ్గట్టు ఆ రంగుని ఉపయోగించు
చివరికి సప్త వర్ణ మిళిత ధవళం లోకి నిర్భయంగా ప్రవేశించు
మృత్యు ఆహ్వానాన్ని చిరునవ్వుతో స్వీకరించు!!

## 3. నా ప్రేమ

కాలగమనంలో నిశ్శబ్ద ప్రయాణంలో
ఛిద్ర స్వప్నం - ప్రేమ
మనసు అగ్నిగర్భంలా జ్వలిస్తూంటే
క్షతగాత్రమైన ప్రేమ
మృత్యువు పెదాలపైని ఎడారిగానం
ఆవిరైపోతున్న ఒక నిర్జీవ ప్రవాహం !
చైతన్య సింధువులా కదలి
సంచలన శబ్దంలా పలికి
హృదయ వీణకి అంతస్స్రోత్రంలా కంపించాల్సిన ప్రేమ
రక్తనాదం లా,
శూన్యరాగం లా
వ్యధిత ధార లా
హృదయావరణాన్ని మెలికలు పెడుతోంది
కన్నీళ్ళను పిండుతోంది
తుఫాను తాకిడిలా
అశ్రు అన్వేషణలో ఉంది
జీవం తగ్గిన గుండె
అసహాయంగా వగచింది
అసలెందుకు ప్రేమించానా అని !!

## 4. ఆత్మ దర్శనం

ఆత్మ దర్శన మవుతుందేమోనని
జీవన దర్పణంలోకి చూస్తే
సుపరిచిత రూపంతో ఒక అపరిచిత అగుపించింది
ఎన్నిసార్లు చూసినా ఏకత్వంలో భిన్నత్వం నాకూ ఆ రూపానికీ.

కొత్త సత్యాన్ని చూసిన ఆనందం
ఆ సత్యం పూర్తిగా అర్థం కాని ఆరాటం !
సంకుచిత సరిహద్దులు లేని స్వేచ్ఛ ఆ రూపానిది
సమతా క్షేత్రానికి అర్థం తెలియని అసమర్థత నాది
స్థితిగతులు వేరైన ఒకే రూపం మాది
చేతనామయి ఆ రూపం
శృంఖలా బద్ధను నేను.
ఊహాకాశాలలో యానం ఆమెది
అనంతమైన నేలదాహం నాది
కోర్కెలకు ప్రతినిధి ఆమె
కోర్కెలను చంపుకునే చిత్త ప్రవృత్తి నాది
ఆనందాన్వేషణలో ఆత్మదర్శనం లో నాకు
చేయూత నిమ్మని మౌనంగా అర్థించాను
నందనవనంలా నవ్వుతూ మాయమయ్యింది
నేను నేనుగా మిగిలిపోయాను
నన్ను నేను తెలుసుకునే ప్రయత్నంలో .....!

## 5. భగ్నప్రేమ

కన్నీళ్ళు కళ్ళల్లో శోక చిత్రాలు చిత్రిస్తుంటే
ఊపిరి వేడిగాలులు మనసును జ్వలింపజేస్తుంటే
తీయని కలలన్నీ కఠిన శిలలై
జీవనగానమే శుష్యవచనమై
సాంత్వనా రహిత జీవితమే ఉన్మాద నృత్యమై
విశాల విశ్వం కుదించిన ఇనుప పంజరమై
నీ రక్తనాళాల్లో ఒక కల్లోల తరంగాన్ని సృష్టించాయి.
ఆ ప్రకంపనంలో ప్రేమ అడుగు జాడల్ని వెదికితే
నీకు దొరికేవి ఏమిటి?

దోసిళ్ళ నిండా అశ్రుకణాలు!
కళ్ళ నిండా ఎండ మావులు !!
ఆ నిరంతరాన్వేషణలో మోసపోతూ
అలాగే బ్రతికి పోతూ
మృత్యు పరిష్వంగంలో విముక్తుడ వవుతావు!

భగ్నప్రేమను నిర్వచిస్తావు!!

## 6. అశ్రువలయాలు

విడుపులేని తుఫానులా
నిర్విరామపు కన్నీటి ధారల అలల్లో
నిశ్శబ్దపు గాయాలను కడుగుతూ
తెగిన నరాలను ముడిపెడుతూ
నెత్తుటి చారలు
వెలిసిన బ్రతుక్కి రంగు వేస్తూంటే
ఇగిరిపోయిన చిరునవ్వును వెతుక్కుంటూ
బ్రతుకు క్షణాల్లోకి వెనుకకు వెళితే
బరువుగా క్రుంగిపోయి
నల్లగా కమిలిపోయి
వివర్ణమయిన ఇంద్రధనుస్సు కనిపించింది!
తన మకిలి దేహానికి
ధూళి నిండిన రంగులకి
ఇప్పటికైనా నూతన శోభనివ్వమని ప్రాధేయ పడింది.
అశ్రువలయాల ఊబిలో కూరుకుపోయిన నేను
నిస్పృహాయంగా నిలబడి పోయాను
రిక్త దృక్కులతో......

* * *

# నగరంలో గగనం

- సరోజినీ ప్రేమచంద్.

ముక్కుకు తాళాలు బిగించి నట్లనిపించి
ఆరుబయట ఆకాశంలోకి చూస్తూ
హాయిగా గాలి తాగాలని
ఆరాటంగా వస్తే
ఇల్లు తుడిచి పారేసిన
గుడ్డ పీలికలా ఆకాశం!
అటువైపు అంబర చుంబిత హర్మ్యం,
ఇటువైపు జారవిడిచిన సిగ్గును
అభినయిస్తున్న తారామణి లాస్యం,
బూరబుగ్గల విప్లవ హీరోల విన్యాసం!
కడిగి ముగ్గులేసిన వాకిలిలా
కళకళలాడేది మావూళ్ళో
వంకర టింకరగా వెలిసిన
బూడిద రంగులో వేళ్ళాడుతున్నదేం?
అల్లరి పిల్లల అగ్గిపుల్లలు పేర్చినట్లు
దూరాన్ని దర్శనం చేయించే
యంత్రపు సాధనాలు!
పసరో కాలయంత్రమో
ఆధునిక యుగంలోకి
అయిష్టంగా తెచ్చిపడేసిన ప్రబంధ నాయకునిలా
మొహమాట పడుతూ శశాంకుడు!
పొగ వాసనలు

ఎడతెగని రొదలు
ఏడుస్తూ పాడే కోయిల
ఎవరూ లేరు నా నే భావన
గగనదేవత కిక్క
నిత్యం
కాలుష్య ధూపం
మనుష్య రక్తంతో
నైవేద్యం
ఇచట వుదయం అంటే వురుకులు
అలసట కాలం - అస్తమాన సమయం.

* * *

## ధర్మసూక్ష్మం

ఉభయ వారగతుల ఉయ్యాల ఊపుగా
సంచరించ గలిగి సంధి చేయు
వారధియము-వరలు-వైరుధ్యముల మధ్య
'ధర్మసూక్ష్మ'మెపుడు-ధరణియందు.

## మిణుగు పురుగు

ఈ విశాలమైన సృష్టిలో గణియింప
పురుగుబోలు వాడు నరుడు సుమ్మ
అయిన గాని ఉన్న అణుమాత్ర శక్తితో
మిణుగు పురుగువోలె మెరయదలతు.

-నండూరి రామకృష్ణమాచార్య

# అమ్మ

- యశశ్రీ రంగనాయకి

తొమ్మిదినెలల
నిరీక్షణ నిష్క్రమించి
దబ్బపండులా నేను దర్శనం ఈయగానే
నన్ను వీడిన మాయ
కనికట్టు చేసినట్టు
అమ్మను
మోహపు కొండచిలువై
చుట్టుకుందట.
ఇక అదీ మొదలు
నాచిలిపి పనులకు
సుద్దతునిచ్చే యశోదమ్మలా మారింది.
అందుకే
అమ్మ కనిపిస్తే చాలు
నా కళ్ళ స్క్రీన్‌లపై
ఆనందపు రంగుల మెరుపులు మెరుస్తాయి.
అమ్మ చేసే చక్కటి పనిని చెల్లాచెదరుచేస్తే
ప్రేమగుడ్డను కళ్ళకు కట్టుకున్న
గాంధారిలా మారేది.
ఎప్పుడైనా పనిచెప్పమ్మా అని బుంగమూతిపెడితే
నిన్నలోకి పరిగెత్తి పారిపోయిన
తన బాల్యాన్ని
నా పాలబుగ్గల్లో చూశానంటూ
పుచ్చపువ్వు వెన్నెల్లా నవ్వేది.
ఆ చూపులో నన్ను సేదదీర్చే చలిపందిరి వుంది

మాటల్లో అనుభూతికే అంతుపట్టని మహత్తు వుంది.
అసలు ఆ ప్రేమతోనే
అమ్మ బొమ్మ
నా హృదయపు గాజుపై
పరిరక్షింపబడ్డ పర్మినెంట్ మౌంట్‌లా మారింది.
నా అందమైన జీవితానికై
అహరహరమూ నాచుట్టూ
పరిభ్రమించిన పరివేషం మా అమ్మ.
అప్పుడప్పుడు
మనసుకు పట్టే మాలిన్యాన్ని
ఆమె
తుడిచే గుడ్డలా మారగానే
ధ్యాన శ్లోకంలానో, తులసి మొక్కలానో మారేదాన్ని.
అంత అద్భుతమూ, అపురూపమూ అయిన అమ్మ
అగరొత్తిలా అనుక్షణం
ఆనందపు ధూపాన్ని వెదచల్లుతూ
కాలం కసిగా ఆడే కర్కశపు ఆటలో
ఆమె ఓపిక ఓజోన్ పొరలా క్షీణిస్తుంటే
ఆ గుండె కలలు
ఏ నిద్రలో తీరుతాయో
అని బెంగపడి
నేను
అమ్మా ---- అమ్మా
అని
కలవరిస్తూ------
పలవరిస్తూ------

* * *

# కథ సశేషం

- అడిగోపుల వెంకటరత్నమ్

వెలుగుతున్న సూరీడును బంధించి
నడివీధిలో సర్కారు లాక్కుపోవడం .........
చంపబడ్డ సూరీడు శవం పై
ఆత్మహత్య లేబుల్ని అతికించడం.......
దృశ్యం స్పష్టమే
దృష్టే స్పష్టాస్పష్టం!
రాబందుల్ని ఎగరేసిన చేతుల్ని
చూపుడు వేళ్ళు గుర్తించవు
సాక్ష్యానికి చిరుకానుకై
అంగవైకల్యం
కాచుక్కూర్చుంటుంది!
కర్త ప్రేక్షకుడైన చోట
కథ సశేషం.....
ఊరి చివర
చీకటి తెరల్లో
ఎండిన గొంతుతో
జోలపాట పాడుతూ
సూరీడు భార్య!
జోలపాటకు
నిద్రలోకి జారని
బాల సూరీడు
తొలకరి అంకురం!

* * *

# సాలెగూట్లో ఆడపిల్ల

- పాపిరెడ్డి నరసింహారెడ్డి

ఆమె విడీవిడని నవ్వు
వాడని మరుమల్లె పువ్వు
సీత్రూచీరలో
ఆమె యవ్వనాలు
హిమలయోత్తుంగ శిఖరాలదాకా
పరచుకున్నాయి
సముద్రాల లోతులదాకా
విస్తరించుకున్నాయి
ఆమె కన్నుల్లో
నిశ్శబ్ద విప్లవాల నీలినీడలు
రోదిస్తూనే ఉంటాయి
ఆమె ఎదపై
మగ పశువుల కామాగ్నుల
యుగాల దెక్కలు
నినదిస్తూనే ఉంటాయి
16,61,81 భేదంలేని
కామాంధులం మనం
ఆమె మాత్రం
16 ఏండ్ల సాలెగూట్లో ఆడపిల్ల!

* * *

# ఒక కొత్త భావన

- 'ఆర్ క్యూబ్'

జీవితం
సాగే గంగా ప్రవాహం వంటిది.
వేసే ప్రతీ అడుగు
ప్రభవించే చైతన్యం కావాలి.
పలికే ప్రతి పదం
ప్రగతించే పాట కావాలి.
కురిసే ప్రతీ నవ్వులో
సరికొత్త చెలిమి అంకురించాలి.
హరిత విహంగమై ఈ పుడమి
ఆనందపుటంచులు చుట్టాలి.
ఆ ప్రవాహంలో
విచ్చిన జ్ఞాన చక్షువులు
ఉషస్సు కెత్తిన హారతులవ్వాలి.
అప్పుడే -
సౌభ్రాతృత్వం
అంబరాన్ని మీటుతుంది
అమృత సముద్ర హృదయులు ప్రసరించిన
ఆశీర్వాద వచనాలకు.
అంబరం
మమతల హరివిల్లై తొంగిచూస్తుంది
మొలక నవ్వులు నర్తించిన
పూల పాదాల అలికిడి విని.

* * *

# మూడు కవితలు

- బి.వి.వి. ప్రసాద్

## విశ్వరూపి

చందమామ
వామనుడిలా
వెన్నెల పాదాలని
నింగీ నేలలపై ఆన్చింది.
మూడో పాదానికి
నా హృదయాన్ని చూపాను
రహస్యాంతర లోకాలకి అణగి
కవిత్వాన్నయి ప్రకాశిస్తాను.

## ప్రపంచాలు

మనిషి ఒక ప్రపంచం
బలం - బలహీనత
వెలుతురు - చీకటి
ఒక ప్రపంచానికి ఒక మిశ్రమం
బహుశా
ప్రతి ప్రపంచంలో
పూలుంటాయి. ఎడారులుంటాయి.
బహుశా
ప్రతిప్రపంచంలో
ముప్పాతిక ఉప్పు సముద్రం వుంటుంది.

## మెలకువ

ఒక తెల్లవారు ఝామున చనిపోయాను.
అకస్మాత్తుగా మెలకువ వచ్చింది.
పూలూ, పిట్టలూ, లేత కాంతీ,
ఈ ఉల్లిపాయకి
రెండే పొరలని ఎందుకనుకోవాలి.
వీటికి చనిపోతే
వేటికి మెలకువో.

---

# జ్యోతిర్మయి

- గాలి నాసరరెడ్డి

హృదయము దివ్వెగా వెలుగులీనుచు దారిని చూపుచుండగా
చెదరిన ముంగురుల్ కలల చిన్నెల నించుక తెల్పుచుండగా
మృదువుగ నవ్వుకొంచు కొసవ్రేళుల గాలికి రంగులద్దుచున్
కదలెడి నీ విలాసమును కాంచితి నెంచితి నిన్ను పొందగన్.

వలపులు పల్లవించె; రసభావము లెవ్వియొ పొంగులెత్తె; క
న్నుల కళల ప్రపంచము వినూతన పద్ధతి గోచరించె; పె
మ్మలుపును పొందె నా నడచు మార్గము; నేనెటు విస్మరింతునే
చెలియరొ! నిన్ను తొల్త దరిసించిన యా మధుర క్షణంబులన్.

సకలాంగాంచిత నిత్యనూత్న సుషమా సౌందర్య లాస్యమ్ముతో
అకలంకోన్నత రాగభావతతితో ఆనందముం గూర్చుచున్
సుకవిత్వంబుగ కానుపించితివహో జ్యోతిర్మయీ! ప్రేయసీ!
ఒక నీవుండిన చాలు తోడుగ జగంబుర్రూతలూగించెదన్.

---

# ధర్మపత్ని

- సి. యస్. శాస్త్రి

''యత్ర నార్యస్తు పూజ్యన్తే''
ఎక్కడో విన్నాం
కానీ; గౌరవించం.
''షడ్ధర్మయుక్తా ఖలు ధర్మపత్నీ''
మాకేం అభ్యంతరం లేదు.
కానీ, ఒక్క సవరణ
నీ సలహాలు లేకపోతే దేశానికేం నష్టం లేదు.
నోర్మూసుక్కూర్చో
అడిగినప్పుడల్లా పుట్టింటిని దోచిపెడుతుంటే
నువ్వు మహాలక్ష్మివే.
నీ అందం ఎవడిక్కావాలి
ఈ ధర్మాన్ని పాటించినంతకాలం
నువ్వు ధర్మపత్నివే.
చిక్కి శల్యమైయినా ఇంటెడు చాకిరీ ఈడుస్తుంటే
నువ్వు గృహిణివి
గడప దాటనంతవరకూ
ఇంటికి దీపానివి.
వీథీ దీపాల మీద రాళ్ళు రువ్వే చీకటి సంస్కృతి
వాల్పోష్టర్ల మీద బురద జల్లే పైశాచికానందం
నీచస్వభావం కానీ,
మావంటి ఉత్తముల లక్షణం కాదు.
కడుపునొప్పి తాళలేక
ఉరిపోసుకు చచ్చావనీ
మొగుడికి పకోడీలు కాల్చిపెట్టే హడావుడిలో

చీరకొంగు అంటుకుని కాలిపోయావనీ
పదిమంది ముందూ కన్నీరు కారుస్తాం
నీ ఫోటోపైన బాష్పాంజలి ముద్రిస్తాం.
ఎన్ని కష్టాలు కడుపు తరుగుతున్నా
పాదాల దగ్గర చోటుకోసం వెతుక్కున్నంతకాలం
నువ్వు మహా యిల్లాలివి
అరిటాకూ-ముల్లూ సామెత నీ కోసమే పుట్టింది.
''చేతులు కాలాక ఆకుల'' సామెత నువ్వు కనిపెట్టావు.
అసలు
దేవాలయం మీద బూతుబొమ్మలు గీసిన మొదటిరోజే
నువ్వెందుకు తిరగబడలేదు
బ్లేళ్ల దగ్గర్నుంచి బీడీల దాకా వ్యాపారానికి
వినియోగించటం మొదలుపెట్టిన మొదటినాడే
నువ్వెందుకు నిలదీయలేదు?
బానిసగా చూచిన మొదటిసారే
నువ్వెందుక ఎదిరించలేదు?
ఈ ఔదాసీన్యం నీ సౌజన్యం అనుకుంటూవుండు
ప్రతివిజయానికీ
వెనకనో అడుగునో
ఒక స్త్రీ ఉంటుందని
వేదిక మీది నుంచే వినిపిస్తుంటాము
అంతేకాని
నీకు
గూడు గుడ్డా ఇచ్చి
బంగారం వంటి వ్యాపారం
పాడుచేసుకుంటామా?

* * *

# రెండు కవితలు

- ఎస్జీడి చంద్రశేఖర్

## సిగ్గుల మొగ్గలు

తెల్లటి
నీ బుగ్గలు చిదిమితే
పాలుకారతాయని అనుకొన్న
నేను ఎంత అమాయకుణ్ణో
నీ బుగ్గల
సిగ్గులు మొగ్గలై
ఎర్రటి రోజాలు పుష్పించాయి.

## నెత్తుటిలో దోగాడుతున్న శిశువులు

నీ ఆలోచనలతో సతమతమయ్యే నాకు
కనుల ముందు, గడచిపోతున్న కాల
వేగంగా తిరుగుతోన్న బుల్‌రోజర్ చైన్‌లా.

నీ అనుభూతి మాధుర్యంలో మునకలేసే నాకు
ఆకాశంలో నడయాడే మేఘాలు
గ్లాసుల్లో తేలియాడే మంచు ముక్కల్లా.

నీ కనుచూపుల్తో హృదయాన్ని గాయం చేసుకొన్న నాకు
ఎర్ర సముద్రంలో పయనించే నౌకలు
నెత్తుటిలో దోగాడుతున్న శిశువుల్లా.

* * *

అనువాద కవిత:

ప్రసిద్ధ గ్రీకు కవయిత్రి

# బిలిటిస్ గీతాలు

అనువాదం

## సౌభాగ్య



# సౌభాగ్య

పేరు : పి. విజయ కుమార్,

కలం పేరు : సౌభాగ్య

పుట్టిన తేది : 25-11-1954.

విద్యార్హతలు : తిరుపతి ఓరియంటల్ కళాశాలలో విద్వాన్,
ఎస్. వి. యూనివర్సిటిలో ఎమ్.ఎ తెలుగు.
రెండిట్లోనూ యూనివర్సిటి ఫస్టు.
ప్రస్తుతం హైదరాబాదు, అబిడ్స్‌లో గ్రామర్ స్కూల్లో ఉపాధ్యాయ వృత్తి.
1972 లో మొదటిసారి భారతిలో పద్యాలు అచ్చయ్యాయి.
1984 లో మొదటి కవితా సంపుటి 'సంధ్యా బీభత్సం' వచ్చింది. దానికి ఒకటిరెండు చిన్ని అవార్డులు వచ్చాయి.
1987 కృత్యాద్యవస్థ (కవితా సంపుటి)
1989 సింహావలోకనం (అనువాద కవితా సంపుటి)
1991 వజ్ర శకలాలు (జర్మన్ మహాకవి గొథే దర్శనం).
హైదరాబాద్ మాక్స్‌ముల్లర్ సంస్థ ప్రచురణ.
1994 నేటి కవిత్వం (వివిధ దృక్పథాలు) సంపాదకత్వం
1995 పునరుత్థానం (కవితా సంపుటి)
1995 రెండు వందల ఏళ్ళ జాన్ కీట్సు
1996 ప్రాపర్టియస్ కవిత
(క్రీ॥పూ॥ 1వ శతాబ్ది రోమన్ కవి)
త్వరలో నువ్వూ-నేను (కవితా సంపుటి), ఋగ్వేదం

ప్రస్తుత చిరునామా : పి. సౌభాగ్య
సిస్టమ్స్ ఆడిట్ డిపార్ట్‌మెంట్, హెచ్.ఎ.ఎల్
బాలానగర్, హైదరాబాదు - 500 042

---

# బిలిటిస్ గీతాలు

బిలిటిస్ 'క్రీ॥ పూ॥ ఆరవ శతాబ్ది గ్రీకు కవయిత్రి. సౌకుమార్యానికి, సహజ సరళ స్పందనకి ఆమె గీతాలు ప్రతీకలు. ప్రేమలోని తాజాదనం, గ్రామీణ జీవన నిసర్గ సౌందర్యం ఆమె గీతాల్లో వున్నాయి. నిర్మల జలాల జలదరింపులు, పచ్చని పచ్చిక బయళ్ళు, తేలిపోయే తెల్లని మేఘాలు, పలుకరించే పర్వతాలు, పరిమళాల్తో సాగే పిల్లగాలి ఆమె కవితల్లో గుబాళిస్తాయి.

సుప్రసిద్ధ గ్రీకు కవియిత్రి 'శాఫో' ఆమె స్నేహితురాలు. శాఫోవి ఒకటి రెండు కవితలు మాత్రమే లభ్యమయ్యాయి. బిలిటిస్ వి చాలా లభ్యమయ్యాయి. గత శతాబ్దం చివర్లో ఫ్రెంచి కవి 'పెర్రీలూయిస్' గ్రీకులో సంచరించి, పరిశోధించి, బిలిటిస్ కవితల్ని సంపాదించి, 1896 లో మొదటిసారిగా ఫ్రెంచిలోకి అనువదించి, బిలిటిస్ గీతాల్ని ప్రపంచానికి పరిచయం చేశాడు. తరువాత ఇతర యూరోపియన్ భాషల్లోకి అవి అనువాదం చేయబడ్డాయి.

-సౌభాగ్య.

## తల్లి సలహా

మా అమ్మ నాకు చీకట్లో స్నానం చేయిస్తుంది
లేత సూర్య కాంతిలో నాకు బట్టలు తొడుగుతుంది.
దీపకాంతిలో తల దువ్వుతుంది. అలంకరిస్తుంది.
మేము విశాలంగా వ్యాపించిన వెన్నెల్లోకి అడుగు పెట్టినా
నన్ను ఆపాదమస్తకం అల్లుకున్న వస్త్రాల్తో ఆచ్ఛాదించుతుంది.
ఆమె నాకు హితబోధ చేస్తుంది.
''అమ్మాయిల్తో ఆడుకో, పసిపిల్లల్తో నృత్యంచెయ్, కిటికీ నుంచి తొంగి చూడకు,
అబ్బాయిల గొంతు వినిపిస్తే కిటికీ తలుపులు మూసేసి వచ్చెసెయ్''
''ఎప్పుడో ఒక సాయంత్రం ఎవరో నిన్ను తీసుకుపోతారు
ఇతర అమ్మాయిల్ని తీసుకుపోయినట్లే నిన్ను వెంటబెట్టుకు పోతారు
గడప దాటి నువ్వు కన్నీళ్ళతో వెళతావు.

మంగళవాద్యాలతో, పిల్లంగోవి పాటలతో నువ్వు మాయమైపోతావు
నీ భర్తతో బాటు నువ్వు వెళ్ళిపోతావు
పగలయినా, మధ్యాహ్నమయినా, రాత్రయినా
నీ స్మృతులపై కన్నీళ్ళు చల్లుతూ దుఃఖిస్తూ వుంటాను.

## ఆగంతకుడు

ఆ సాయంత్రం ఇంటిముందు తలుపుకానుకుని కూచున్నాను
ఇంటిముందు నుంచి ఓ యువకుడు వెళుతున్నాడు
హఠాత్తుగా నన్ను చూశాడు
చూపులు కలిసేలోగా తల తిప్పుకున్నాను
అతడు నన్ను పలకరించాడు, నేను బదులివ్వలేదు
నా దగ్గరకి రావలని ప్రయత్నించాడు
గోడ పై వున్న కొడవలి అందుకున్నాను
అతడు ఇంకా ముందుకు వచ్చుంటే కొడవల్తో చెంపలు చీరేసేదాన్ని
ముందుకు వెయ్యబోయిన అడుగు వెనక్కి వేశాడు
నన్నుచూసి చిరునవ్వు నవ్వడం మొదలుపెట్టాడు
మెచ్చుగా తన అరచేతిని శ్వాసించి, చేతిని నా వేపు సాచి
''నా ముద్దు అందుకో'' అని అన్నాడు, వెళ్ళాడు
నేను ఏడ్చాను! జలజలా కన్నీళ్ళు వొదిలాను!
పట్టలేని నా దుఃఖం చూసి మా అమ్మ కోప్పడింది.
భయంతో కంపించాను.
తేలు కుట్టినంత వేదనతో మెలికలు తిరిగాను.
గద్గద కంఠంతో మా అమ్మతో అన్నాను.
''అతను నన్ను కౌగిలించుకున్నాడు''
మా అమ్మ కూడా నన్ను కౌగలించుకుంది
తన రెండు చేతుల్తో నన్నెత్తుకుని హృదయానికి హత్తుకుంది.

## మెలకువ

ఉదయకిరణాలు కిటికీలోంచి వొచ్చి నన్ను తాకాయి.
నిజానికి నేను లేవాలి
కానీ తెల్లవారి తియ్యటి మత్తు నన్ను లేవనియ్యలేదు.
కళ్ళు తెరచుకునే కమ్మని వెచ్చని నా పడక్కి అతుక్కుపోయాను
చాలాసేపు అలాగే మత్తుగా పడుకుండి పోయాను
అప్పటికే సూర్యుడు ఆకాశంలోకి ఎగబాకుతున్నాడు
నేను లేవాలి.
మేకలకు పచ్చగడ్డి ఫలహారం ఇవ్వాలి.
సరోవరం నుండి సజల జలాల్ని తీసుకురావాలి
మేకలూ నేనూ ఒకేసారి ఆ నీళ్ళనే తాగుతాం!
మేకల్ని స్తంభాలకు కట్టెయ్యాలి.
వెచ్చటి పొదుగుల్ని నీళ్ళతో తడిపి పాలు పితకాలి
మేక పిల్లలు ఈర్ష్యపడకుంటే
వాటితో పాటు పొదుగుల్లో తలదూర్చి తాజాపాలు నేనూ తాగాలి
ఇప్పటికే లేవాలి
కిరణాలు వేడిగా తడుతున్నాయి
సూర్యుడు మరీ ముందుగా వచ్చినట్లున్నాడు
మా అమ్మకూడా ఇంకా నిద్రపోతూనే వుంది.

## వర్షం

అద్భుతమైన వర్షం, అన్ని వస్తువుల మీదా కురుస్తోంది
మృదువుగా నిశ్శబ్దంగా భూగోళాన్ని తడుపుతోంది
ఇంకా చినుకులు ఆగలేదు
నేను చెట్ల గుబుర్ల లోకి వెళ్ళాలి
వానతో తడిసిన నేలపై నగ్నపాదాలతో నడవాలి

వసంతకాల వర్షం ఎంత మనోహరమైంది
ఎంత సుందరమైంది, ఎంత సుకుమారమైంది!
కొమ్మలన్నీ, తడిసి బరువెక్కిన పూలతో భారంగా కదుల్తున్నాయి.
తేమలో కలిసిన పరిమళం నన్ను ఆనందంలో తేల్చింది
లేతకొమ్మల సందులనించీ సూర్యకిరణాలు మిరుమిట్లు గొలుపుతూ
చినుకుల్లో స్నానం చేస్తున్నాయి
అయ్యో! నేల నేలంతా పూలు ఎటుచూసినా రాలిపోయాయి
రాలివాలిన పూలు ఎంత దయనీయంగా వున్నాయి!
వాటిని సేకరించలేము, మట్టిలో కలిసిపోవడం చూడలేము
పల్లంలో నిల్చిన బురదనీటిలో
పేడ పురుగులూ, నత్తలూ అటూ ఇటూ తిరుగుతున్నాయి
నేను వాటిని తొక్కలేను
బంగారు రంగులో గుడ్లు మిటకరిస్తున్న
వూసర వెల్లిని భయపెట్టనూ లేను.

## పూలు

వన దేవతలారా! సరోవర దేవతలారా!
స్నేహితులందర్లో కెల్లా మీరు మధుర స్నేహితులు
నేనిక్కడే వున్నాను!
నన్ను కవ్విస్తూ దాగుడుమూత లాడకండి!
నా ముందుకు రండి!
అసంఖ్యాకంగా వున్న ఈ పూల భారంతో
బరువెక్కిన నాకు సహాయపడండి
అరణ్యమంతా అవిశ్రాంతంగా తిరిగాను.
వృక్షదేవత తన చేతుల్తో నాకు పూలు అందించింది
తన చేతుల్తో నన్ను దగ్గరకు తీసుకుంది
తన విశాల వినీల శిరోజాలని నాపై కప్పింది

రంగురంగుల చివురుటాకుల్తో నన్ను గిలిగింతలు పెట్టింది
చూడండి!
ఈ లెక్కలేనన్ని పూలని మోయలేకపోతున్నాను
రండి!
దండల్ని అల్లడంలో నాకు సహకరించండి
కాదని అన్నారంటే నాకు కోపమొస్తుంది సుమా!

## అసహనం

నేను ఆమె చేతుల్లో వాలి కుళ్ళి కుళ్ళి ఏడ్చాను
నా వేడి కన్నీళ్ళతో ఆమె భుజాల్ని తడిపాను
మెల్లగా నా వుద్వేగం చల్లారిన తర్వాత ఇలా అన్నాను
''అయ్యో! నేనింకా పసిదాన్నే!
యువకులెవరూ నన్ను కన్నెత్తి చూడరు!
యవ్వనం నన్నెప్పుడు సమీపిస్తుంది?
రెండు చందమామల్ని కప్పి నిండయిన వస్త్రాన్ని ఎప్పుడు ధరిస్తాను?
ముద్దులతో ఎప్పడు మరులు గొల్పుతాను?
వంపులు లేని నా వొంటిపై ఎవరి చూపులూ వాలవు
దారివెంటే నడచిపోతూ వుంటే
నా శిరోజాల నుండి జారిన పువ్వును అందుకోవాలని ఎవరూ ఆరాట పడరు
నా పెదాల్ని చుంబనాల కోసం ఇతరులకి సమర్పించినా
ఎవరూ ఈర్ష్యాసూయలకి లోను కావడం లేదు''
ఉప్పెనలా ఎగిసిపడే నా ఉద్రేకపు మాటలన్నీ విని ఆమె మృదువుగా అంది
''బిలిటిస్! ముద్దుగొలిపే చిట్టితల్లీ!
చందమామపై లేతపిల్లి ఏడ్చినట్లు రోదించావు
నిష్కారణంగా బాధ పడుతున్నావు
అన్నీ క్షణంలో జరిగిపోవాలని అసహనంతో రెచ్చిపోయే అమ్మాయిలు
అనుకున్న వాటికి అందనంత దూరంలోనే వుంటారు!

## పోల్చుకోవడం

కోకిల మా తొలికాంక్షల్ని వసంత కాలంలో గానం చేస్తుంది
వికసించిన యౌవన వతుల స్పర్శ ఎరుగని తాజా శరీరాలు
పూలని అలంకరించుకుని భూమిలా పులకరిస్తాయి
రాత్రిళ్ళు వయసులో వున్న అమ్మాయిలంతా ఒక చోట చేరుతాము.
మా కలల్ని పంచుకుంటాము, కాంక్షల్ని పంచుకుంటాము
ఒక్కోసారి ఒకర్తో ఒకర్ని పోల్చుకుంటాము
అందాలలో తేడాలని గురించి ఆసక్తిగా చర్చించుకుంటాము
పొడవయిన మా శిరోజాల్లో పోలికలు వెతుకుతాము
ఇంకా చిన్నవిగానే వున్న మా స్తనాల్ని గురించి ముచ్చటించుకుంటాము
అండంలోనే వుండి పల్చటి పై పెంకును పగలగొట్టలేని
లేత పిట్టల్లా అల్లాడుతాం
నిన్న మా అక్కతో నన్ను నేను పోల్చుకున్నాను
మా ఇద్దరి వక్షోజాల్నీ మరీ మరీ పోల్చుకున్నాను
మా అక్క ఆమె స్తనాల గురించి మరీ గర్వపడుతోంది
నెలరోజుల్లో కలువ పువ్వుల్లా ఎదిగిన రొమ్ముల గురించి అహంకరించింది
నా చిన్ని స్తనాల్ని పరిహసించింది
వేసుకున్న బట్టల్నించి బలంగా కనిపించనందుకు వెక్కిరించింది
నన్ను 'పసిపిల్ల' అని పరిహసించింది
పురుషులెవ్వరూ లేని ప్రశాంత ఏకాంతంలో
అమ్మాయిలందరం నగ్నంగా తయారయ్యాం
అపూర్వకాంతి మమ్మల్ని అల్లుకుంది
మా అక్క ఒక్క విషయంలో నన్ను ఓడించినందుకు
అందరి సమక్షంలో ఎన్నో విషయాల్లో
ఆమెని అధిగమించానని నిరూపించుకున్నాను.

## అరణ్యానది

అరణ్య గర్భంలో ఆహ్లాదంగా ప్రవహించే నదిలో
ఒక్కదాన్నే నగ్నంగా స్నానం చేశాను
నల్లని నీటిలో అజ్ఞాతంగా దాగి
కనిపించకుండా వున్న జలదేవతల గురించి భయపడ్డాను
నేను వాళ్ళని ఎలుగెత్తి పిలిచాను
వాళ్ళతో, వాళ్ళ శరీరాల్తో నన్ను నేను పోల్చుకోడానికి వుత్సాహపడ్డాను
నదిలో నల్లని నీళ్ళలో రహస్యంగా దాగి వుండడానికి
నా వినీల విశాల శిరోజాలతో నా వొళ్ళంతా కప్పుకున్నాను
నీటిపై తెల్తున్న పూలని నా పై పరచుకున్నాను
పచ్చని పచ్చికని పైటలా కప్పుకున్నాను
జల దేవతలకు సందేహం రాకుండా
నా స్తనాల్ని చేతుల్తో కప్పుకున్నాను
తలని పచ్చిక చాటుగా దాచిపెట్టాను
దీనంగా పిలిచాను
జలదేవతలారా! రండి!
దయతో నా దగ్గరకి రండి! నాతో ఆడుకోండి!
అదృశ్యంగా పారదర్శకంగా పరవశంగా
నన్ను అల్లుకున్న జలదేవతల మృదువైన చేతుల్ని
నేను ముద్దులాడాను.

## వెన్నెల్లో ఆటలు

విరగబూసిన వెన్నెల కింద మెత్తటి పచ్చికలో
వూదారంగు సిల్కు శిరోజాల కదలికల్తో
జంటలుగా నృత్యం చేస్తున్నారు
ఒకరు ప్రియుడి వేషంలో, ఒకరు ప్రియురాలి వేషంలో

రాసక్రీడ లాడుతున్నారు
ప్రియురాలు సిగ్గుతో మొగ్గవుతూ తలవంచుకొని అంది
''నీకూ నాకూ ఏమిటి సంబంధం?''
దూరంగా చెట్ల వెనకనించి దేవదూత గానం చేస్తున్నట్లు
పిల్లంగోవి పాట గాల్లో కలిసి వీస్తోంది
ప్రియుడు పరవశంగా అన్నాడు
''నిన్ను చూడాలనే వచ్చాను
నీ చేయి అందుకోవాలనే వచ్చాను''
లయానుగుణంగా ఇద్దరి పాదాలూ కదిలాయి
శరీరాలు సన్నిహితమయ్యాయి
ఒకరినొకరు అధిగమించాలని రాగంలో రాగంలా కలిసి అభినయించారు
ప్రియుడు ప్రియురాలి రెండు చెవులు పట్టుకున్నాడు
రెండు అంచుల కప్పును దగ్గరకు తీసుకున్నట్లు
ఆమె వదనాన్ని దగ్గరకు తీసుకున్నాడు
మసకేసిన చెట్ల నీడల్లో
మనసంతా పొంగుతున్నట్లు ఆమె పైగి వొంగాడు
దహించే అధరాల్ని దాహంతో ముద్దుపెట్టుకున్నాడు.

## కథ చెప్పవూ!

పసిపిల్లలకు నేనంటే ప్రాణం
వాళ్ళు నన్ను చూస్తూనే పరుగెట్టుకుంటూ నా దగ్గరి కొస్తారు
నన్ను చుట్టుకుంటారు
నా కాళ్ళు వాటేసుకుంటారు
నా బట్టలు లాగుతారు
నన్ను కౌగిలించుకుంటారు
వాళ్ళ చిన్ని చేతుల్తో నన్ను తీగల్లా అల్లుకుంటారు
వాళ్ళు పూలు సేకరించుకొస్తే అన్నీ నాకే ఇస్తారు

సీతాకోక చిలుకల్ని పట్టుకొచ్చి నా దోసిట్లో వొదుల్తారు
వాళ్ళు ఏమీ తీసుకురానప్పుడు నన్ను లాలిస్తారు
ముద్దులాడుతారు
నా చుట్టూ ఒద్దికగా కూచుంటారు
వాళ్ళు నా చెక్కిళ్ళు ముద్దులాడుతారు
నా వొళ్ళో కూచుని నా వక్షంపై తల ఆనిస్తారు
నా కళ్ళలో కళ్ళుంచి నన్ను బతిమలాడుతారు
వాళ్ళు ఏమడగబోతున్నారో నాకు తెలుసు
వాళ్ళు అద్భుతమైన, ఆశ్చర్యకరమైన
ఆనందలోకాల్లో విహరింపజేసే
కథల కోసం తహతహలాడుతున్నారు.

## రహస్యాలు

మరుసటి రోజు నా స్నేహితురాలి ఇంటికి వెళ్ళాను.
ఎర్రబడిన ఆమె కళ్ళలోకి కళ్ళు పెట్టి చూశాను.
మా ఇద్దరికీ ఏకాంతం కోసం నన్ను గదిలోకి తీసికెళ్ళింది.
నేనామెను ఎన్నో అడగాలనుకున్నాను.
కానీ ఆమెను చూసిన క్షణం అన్నీ మరచి పోయాను.
చొరవగా ఆమె మెడకు చేతులు చుట్టి దగ్గరకు తీసుకోలేకపోయాను.
ఆమె ఖరీదయిన వస్త్రాల్ని ముట్టుకోడానికి సాహసించలేకపోయాను.
ఆమె ముఖంలో ఎలాంటి మార్పూ కనిపించక ఆశ్చర్యపోయాను.
ఆమె ఇప్పటికీ నా ఆత్మీయ స్నేహితురాలయినప్పటికీ
నిద్రలేని నిన్న రాత్రి నించీ
నన్ను వులిక్కిపడేకా చేసే ఎన్నో అపూర్వ విషయాల గురించి తెలుసుకున్నట్లుంది.
వున్నట్లుండి ఆమె మోకాళ్ళ దగ్గర కూచున్నాను.
నా చేతుల్లోకి ఆమె చేతుల్ని తీసుకున్నాను.
పట్టలేని వుద్రేకంతో, ఆత్రంతో ఆమె చెవిలో గుసగుసలాడాను.
ఆమె నావేపు తిరిగి, నా చెంపకు చెంప ఆనించి
తాపీగా అన్నీ వివరించింది, విశద పరచింది.

(సశేషం)

# కవితా! ఓ కవితా!

## (ఇటీవల వెలువడిన కొన్ని నూతన కవితా సంపుటాల వివరాలు)

1. **'కరుణ కమలం'**: పొన్నా లీలావతి, లెక్చరర్, తెలుగు విశ్వవిద్యాలయం, రాజమండ్రీ ప్రాంగణం, బొమ్మూరు, తూ.గో.జిల్లా, వెల:రూ.50.00.
2. **'కోటి రత్నాల వీణ'**(పద్య కవితా సంపుటి): బెజవాడ కోటి వీరాచారి, 1-1-1008, సిద్ధార్థ నగర్, వరంగల్లు-506 004, వెల: రూ. 35.00
3. **'నిరంతరం'**: టి. శ్రీరంగస్వామి, శ్రీలేఖ సాహితి, 5-11-481, విద్యారణ్యపురి, వరంగల్లు-506 009, వెల: రూ. 10.00
4. **'గాయపడిన ఒక గుండె కేక'**: సంగుభట్ల సాయిప్రసాద్, సాంఖ్యాయన ప్రచురణలు, ఇం.నెం. 2-44, అమరావతి, గుంటూరుజిల్లా. వెల: రూ.15.00
5. **'సుప్రభాతం'** (పద్య కవితా సంపుటి) నేమాని రామజోగి సన్యాసిరావు, వారణాసి వారి వీధి, తణుకు-534211, పశ్చిమ గోదావరిజిల్లా. వెల: రూ 24.00
6. **'కాదంబిని'** (పద్య కవితా సంపుటి) రాళ్ళబండి కవితా ప్రసాద్, 'సహృదయ' శ్రీ వి. లక్ష్మీకాంతరావు, 1/697-1-ఎ, హంటర్ రోడ్డు, హన్మకొండ, వరంగల్ జిల్లా. వెల: రూ 25.00
7. **'ఆమని'** (పద్య కవితా సంపుటి) చిలకమర్తి సుబ్రహ్మణ్య శాస్త్రి, మత్స్యపురి, వీరవాసర మండలం, పశ్చిమ గోదావరి జిల్లా. వెల: రూ. 10.00
8. **'మూడోకన్ను'** శ్రీనివాసరావు, సాహితీ సమితి, 6-7-42/ఎ, హన్మకొండ, వెల: రూ.20.00
9. **'కవిత్వం పై ఎర్రజెండా'** (విప్లవ కవితా సంకలనం), ప్రగతి బుక్ హౌస్, మ్యూజియం రోడ్డు, విజయవాడ. వెల: రూ. 30.00
10. 'ప్రేరణ' కె. ప్రభాకర్, రవిపబ్లిషింగ్ హౌస్, 22-7/4, కె.పి.హెచ్.బి.కాలనీ, హైదరాబాద్. వెల: రూ. 100.00
11. **'పదునెక్కిన పాట'** (దళిత కవిత్వం) సంపాదకుడు: జి.లక్ష్మీనరసయ్య, విశాలాంధ్ర బుక్ హౌస్, హైదరాబాదు.
12. **'ఇక ఊరు నిద్రపోదు'**, హనీఫ్, ఎస్.ఇ.ఎల్.డి. 1183, పి.వి.కాలనీ, మణుగూరు-507 125, ఖమ్మం జిల్లా. వెల: రూ. 15.00

13. **'బ్రతుకు బాట-ఈ దేశం నాది'** - వీరబత్తిని శ్రీశైలం, ఇం.నెం.20-36, చేర్యాల-506 233, వరంగల్లు జిల్లా. వెల: రూ. 35.00
14. **'బాలగీతాంజలి'** - నీలా జంగయ్య, ఇం.నెం.2-1-527/7, నల్లకుంట, హైదరాబాద్.
15. **'పరంపర'** - మధునాపంతుల సత్యనారాయణ మూర్తి, ఆంధ్ర కుటీరము, పల్లిపాలెం, (వయా) యానాం-533 464. వెల:రూ 20.00
16. **'మహాపథం'** - అడిగోపుల వెంకటరత్నం, ప్రజాశక్తి బుక్‌హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-520 002. వెల:రూ. 20.00
17. **'నది చెప్పని కథ'** (పద్య కావ్య సంపుటి) - నాగభైరవ కోటేశ్వరరావు, నాగభైరవ కళాపీఠం, గుళ్లాపల్లి-523 211, ప్రకాశం జిల్లా. వెల:రూ. 20.00
18. **'ప్రాపర్టియస్ కవిత'** - సౌభాగ్య, సిస్టమ్స్ ఆడిట్ డిపార్టుమెంట్, హెచ్.ఎ.ఎల్. బాలానగర్, హైదరాబాద్. వెల:రూ. 20.00
19. **'వద్దేపల్లి కవిత'** - వద్దేపల్లి కృష్ణ, 1-5-62/3, చైతన్యపురి, హైదరాబాదు -500 060. వెల:రూ 50.00
20. **'అధిక్షేపణ'** (పద్యకావ్య సంపుటి) - 'వెంపో' (పొట్లూరి వెంకటేశ్వరరావు), రామకోటయ్య కుటీరం, మొఖాసా కలవపూడి-521 345, మండవల్లి మండలం, కృష్ణాజిల్లా. వెల:రూ. 45.00
21. **'నది-నగరం'** - ఆర్వీయస్. సుందరం, చింతల పద్మావతి హోం లైబ్రరీ, 76-5-16, గాంధీపురం-2, రాజమండ్రి-533 103. వెల:రూ. 20.00
22. **'దళిత మేనిఫెస్టో'** (దళిత కవితల సంకలనం) - సంపాదకులు:కేశవకుమార్, కె.సత్యనారాయణ, నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్. వెల:రూ. 20.00
23. **'పల్లవి లేని పాట'** - భూషి కృష్ణదాసు, చేతనా రైటర్స్ సర్కిల్, 27, వెంకట రమణాకాలనీ, హైదరాబాద్-500 004. వెల:రూ. 25.00
24. **'చండాల చాటింపు'** (దళిత కవిత్వం) - నాగప్పగారి సుందర్ రాజు, ప్రతులకు సవ్వప్పగారి ఈరన్న, మొలగవల్లి కొట్టాల (గ్రా), ఆలూరు(మం), కర్నూలుజిల్లా-518 398. వెల:రూ. 30.00
25. **'రాగరంజని'** (లలిత గీతాల సంపుటి) - ఒ.ఎమ్.గోపాలరావు, చిత్రవాణీ పబ్లికేషన్స్, కావలి. వెల: రూ. 40.00

26. **'యుద్ధం మొదలైంది'** (సామ్రాజ్యవాద వ్యతిరేక కవితా సంపుటి) - వెల:రూ. 8.00. **'ఉరికంబం మీద సూర్యుడు కెన్ సారో వివా** (కవితా సంకలనం), వెల:రూ.20.00 **'దిష్టిబొమ్మ'** (సామ్రాజ్యవాద వ్యతిరేక దీర్ఘ కవిత) - పి. విద్యాసాగర్, వెల:రూ.10.00 ప్రజారస ప్రచురణలైన పైమూడు కావ్యాలకు- జీవన్, డోర్‌నెం.4-4-38, 4/5 రామన్నపేట, కొరిటెపాడు, గుంటూరు-522 007.

27. **'ప్రవహించే పాట'** (ఆంధ్రప్రదేశ్ దళిత పాటలు) - సంపాదకుడు: బి.యస్. రాములు, మైత్రి బుక్‌హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ-520 002. వెల:రూ. 50.00

28. **'బహు వచనం'** (దళిత బహుజన కవిత్వం) - సంపాదకుడు: సుంకిరెడ్డి నారాయణరెడ్డి, నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాదు. వెల:రూ 15.00.

29. **'సన్నివేశం'** - శంకర వెంకట నారాయణ, ఆచంట, పశ్చిమ గోదావరి జిల్లా-534 123. వెల:రూ10.00

30. **'ప్రవాహగానం'** - దాము, అప్పసారు ప్రచురణలు, 2-600, సత్రం వీథి, కొండారెడ్డిపల్లి, చిత్తూరు-517 001. వెల:రూ.20.00

31. **'ఒక్కొక్కరాత్రి'** - హెచ్చార్కె కవిత్వం , విశాలాంధ్ర బుక్‌హౌస్, హైదరాబాదు-500 001. వెల:రూ.20.00

32. **'దేవులాట'** (కవితా సంకలనం) - ప్రభాత ప్రచురణలు, నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాదు. వెల:రూ15.00

33. **'చాటు పద్యరత్నాకరము'** - సంపాదకుడు: దీపాల పిచ్చయ్య శాస్త్రి, నాలుగవ కూర్పు, ప్రచురణ: దీపాల రాధాకృష్ణమూర్తి, కావలి. వెల:రూ.30.00

34. **'శివోహం'** - సంపాదకుడు: పురాణపండ శ్రీనివాస్, జ్ఞానమహాయజ్ఞ కేంద్రం, పురాణపండవారి వీథి, రాజమండ్రి-533 104. వెల:ఉచితం

35. **'కృష్ణరశ్మి'** (పద్యకవితా సంపుటి) - సుప్రసన్న, సహృదయ, లక్ష్మీకాంతరావు, ఇం.నెం.1-7-1047, హంటర్‌రోడ్డు, హన్మకొండ. వెల:రూ.20.00

36. **'జీవన స్రవంతి'** - యస్. బషీర్, విశాలాంధ్ర బుక్‌హౌస్, హైదరాబాదు ఇతర బ్రాంచీలు. వెల:రూ15.00

37. 'గరుడపురాణం' - పేర్వారం జగన్నాథం, 2-8-120, మిథిలా నగర్, బాలసముద్రం, హనుమకొండ, వరంగల్లు. వెల:రూ 20.00

38. 'Sweet Depences' & 'Storms and Breezes on Mortal Waves' - Yeshodhara Gopal Rao and Ambica Ananth, 72, Vijayashree, 5th Temple Road, 15th Cross, Malleswaram, Bangalore - 560 003. Price Rs.90/-

39. 'రాసపూర్ణిమ' (పద్య కవితా సంపుటి) - ఉత్పల సత్యనారాయణాచార్య, పోతనకీర్తి కౌముది,145, అలకాపురి, హైదరాబాదు. వెల:రూ.25.00

40. 'ప్రాణహిత' - సన్నిధానం నరసింహశర్మ, 2016-24, సాంబశివరావు పేట, రాజమండ్రి-533 104. వెల:రూ25.00

41. 'కవితా ప్రసూనాలు' (పద్యకవిత) - డి.ఎ.ఎల్.ఎన్.మూర్తి, 8-145/1, వసంతపురి కాలనీ,మల్కాపురి, హైదరాబాదు. వెల:రూ.30.00

42. 'హృదయ రవళి' - లక్ష్మి, ప్రధానోపాధ్యాయిని, నెహ్రూ కాన్వెంట్ స్కూలు, అశోక్ నగర్, కాకినాడ-533 003. వెల:రూ. 20.00

43. 'రచ్చబండ' - మన్నూరి నాగేష్‌బాబు, లోకాయత ప్రచురణలు, అంబేద్కర్‌కాలనీ, పొన్నూరు-522 124. వెల:రూ. 25.00

**ఇతరపద్యకావ్యాలు:**

44. 'మృత్యులగ్నము' - కొమరవోలు వెంకటసుబ్బారావు, వెల:రూ.50.00

45. 'ఛిన్నమస్త- కొమరవోలు వెంకట సుబ్బారావు, 33/55, ఆఫీసర్స్ కాలనీ, ఆర్.కె.పురం, సికింద్రాబాదు. వెల:రూ. 40.00

46. 'పురుషోత్తముడు' - అష్టకాల నరసింహరామశర్మ,6-2-56, బొర్ర హనుమాన్ వీధి, సిద్దిపేట. వెల:రూ. 40.00 '

47. 'పురుషోత్తమ చక్రవర్తి' - మేడసాని మోహన్, డైరెక్టరు, అన్నమాచార్య ప్రాజెక్టు, తిరుపతి. వెల:లేదు.

48. 'శతావధాన శారద' - పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, 76-8/1-27(1), లలితానగర్, విజయవాడ-520 012. వెల:రూ.10.00

49. 'హేమంత ప్రస్థానము- ఇతర కృతులు': దిగుమర్తి వేంకట సీతారామస్వామి, ప్రతులకు: డి.జగన్నాథ శౌరి, హెచ్.ఐ.జి., ఫ్లాట్ నెం.107, సాగర్ నగర్, విశాఖపట్టణం-530 045. వెల:రూ.20.00

# చైతన్య కవితా వేదిక

## బెంగుళూరు

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ టి.పట్టాభిరామరెడ్డి(పఠాభి) |
| అధ్యక్షులు | : | శ్రీ డి.కె. ఆదికేశవులు |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఎ.ఎస్.<br>శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి<br>శ్రీ కె.పి.రావు<br>శ్రీ వై.వి. వెంకటేశ్వరరావు<br>శ్రీ జె.బాపురెడ్డి, ఐ.ఎ.ఎస్. |
| కార్య దర్శులు | : | ఆచార్య తంగిరాల సుబ్బారావు<br>డా. ఆర్వీయస్ సుందరం |
| సహ కార్యదర్శులు | : | డా. దివాకర్ల రాజేశ్వరి<br>శ్రీమతి అంబికా అనంత్<br>డా. పి.యు.బి.శర్మ<br>డా.కె.చంద్రప్ప<br>డా.ఎం.రుక్మాంగద నాయుడు<br>శ్రీ వి.రామనరసింహారెడ్డి |
| కోశాధికారి | : | ఆచార్య సరగు కృష్ణమూర్తి |
| మహారాజపోషకులు | : | శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు<br>శ్రీనివాసా ట్రస్టు, బెంగుళూరు-చిత్తూరు |
| రాజపోషకులు | : | శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి,(పఠాభి) బెంగుళూరు. |

# చైతన్య కవిత

**1996 లో చేరిన చందాదారులు:-**

**పోషకులు-**

1. డా. జె.బాపురెడ్డి, ఐ.ఏ.యస్., హైదరాబాదు.
2. డా.ఎన్.సురేంద్ర, ఎం.బి.బి.యస్., సంగారెడ్డి, మెదక్‌జిల్లా.
3. శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, గుళ్ళాపల్లి, ప్రకాశం జిల్లా.
4. డా. పి.రవిశర్మ, డా. పి.శేషుశర్మ, అట్లాంటా, యు.యస్.ఏ.
5. డా. శ్రీపాద కృష్ణమూర్తి, గుమ్మలూరు, పశ్చిమగోదావరిజిల్లా.
6. డా. జి.యస్.వి.ప్రసాద్, ఎమ్.ఎస్.(ఇ.ఎన్.టి. స్పెషలిస్ట్), తణుకు, పశ్చిమగోదావరిజిల్లా.
7. శ్రీమతి సి.హెచ్. మారుతీ శ్రీలత- శ్రీ వి. సురేంద్రనాథ్ దంపతులు, బెంగుళూరు.
8. శ్రీమతి అంబికా అనంత్ - శ్రీ పి.యస్.వి. అనంత నారాయణ దంపతులు, బెంగుళూరు.

**జీవిత సభ్యులు:-**

1. శ్రీ ఎన్.సి.రామసుబ్బారెడ్డి, రిటైర్డ్ ఎం.డి.ఓ, కడప.
2. శ్రీ ఎన్. భీమన్న (మేనమామ శ్రీ వి. సుందరయ్యగారి పేర), దేవినగర్, బళ్ళారి.
3. శ్రీ వీరగోని ఆంజనేయులు గౌడ్, వేములవాడ, కరీంనగర్ జిల్లా.

ప్రత్యేక సభ్యులు:-

1. డా. కలువగుంట రామమూర్తి, టి.టి.డి., తిరుపతి.
2. శ్రీ ఆర్వీయార్( శ్రీ ఆర్.వెంకటరావు), ప్రిన్స్‌పాల్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రామన్నపేట, నల్గొండజిల్లా.
3. ఆచార్య జి.లక్ష్మీనారాయణ, డైరెక్టరు తులనాత్మక సాహిత్య శాఖ, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

4. శ్రీ జూకంటి జగన్నాథం, సిరిసిల్లా, కరీంనగర్‌జిల్లా.
5. ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి, డా. బి. ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
6. కుమారి జి.నళిని, ఆంధ్రోపన్యాసకురాలు, క్వీన్‌మేరీస్ కళాశాల, మద్రాసు.
7. శ్రీ 'సౌభాగ్య', హెచ్.ఎ.ఎల్., బాలానగర్, హైదరాబాదు.
8. శ్రీ యార్లగడ్డ వెంకట సుబ్బారావు, నల్లూరు, గుంటూరుజిల్లా.
9. శ్రీమతి జె. మంగమ్మ, మదనపల్లె, చిత్తూరుజిల్లా.
10. డా. శ్యామలా కల్లూరి, ఆంగ్లోపన్యాసకురాలు, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ, న్యూఢిల్లీ.
11. డా. తిమ్మావజల త్యాగరాజమూర్తి, తెలుగు రీడరు, బి. టి. కళాశాల, మదనపల్లె.
12. శ్రీ భల్లం సూర్యనారాయణరాజు, తెలుగు పండిట్, లంకల కోడేరు, పశ్చిమ గోదావరి జిల్లా.
13. శ్రీమతి కె. సౌజన్యకుమారి, ఆంధ్రోపన్యాసకురాలు, బి. టి. కళాశాల, మదనపల్లె.
14. శ్రీ పి. దత్తశర్మ, ఆంగ్లోపన్యాసకుడు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, మాకవారి పాలెం, విశాఖ జిల్లా.
15. శ్రీ వి.నాగన్న, మైన్ ఓనర్, వెల్దుర్తి, కర్నూలుజిల్లా.
16. శ్రీ టి.వెంకట నాయుడు, లాండ్‌లార్డ్, బి.తాండ్రపాడు, కర్నూలు.
17. శ్రీ యస్. పవన్‌కుమార్, ఎల్.ఐ.సి. ఆఫ్ ఇండియా, మదనపల్లె.
18. శ్రీ ఎ. యస్. రాజశేఖర్, కార్పొరేషన్ బ్యాంకు, కడప.
19. శ్రీ జ్వాలాముఖి, దిగంబర కవి, హైదరాబాదు.
20. డా. కేతుబుచ్చిరెడ్డి, ఎం.బి.బి.యస్., కమలానగర్, అనంతపురం.
21. శ్రీ సున్నపురాళ్ళ జయరామిరెడ్డి, కమలానగర్, అనంతపురం.
22. శ్రీ జి.సత్యనారాయణ, బచ్చుపేట, మచిలీపట్టణం, కృష్ణాజిల్లా.
23. శ్రీ గూడ శ్రీరాములు, ప్రగతినగర్, భిలాయ్, మధ్యప్రదేశ్.

24. శ్రీ శిష్ట్లా వెంకటరావు, ప్రధానకార్యదర్శి, ఆంధ్ర పద్య కవితా సదస్సు, యలమంచిలి, విశాఖజిల్లా.

25. డా. జి.యస్.కుమార్, హిందీ ఆఫీసర్, సిండికేట్ బ్యాంక్, హెడ్డాఫీసు, మణిపాల్, దక్షిణకన్నడ.

26. డా. పి.సంజీవమ్మ, తెలుగురీడరు, నాగరాజుపేట, కడప.

27. 'అష్టావధాని' శ్రీ ఆశావాది ప్రకాశరావు, ప్రభుత్వడిగ్రీ కళాశాల, పెనుకొండ, అనంతపురంజిల్లా.

28. ఆచార్య దువ్వూరు నరసింహారెడ్డి, ఎకనామిక్స్ ప్రొఫెసర్, హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

29. 'అష్టావధాని' శ్రీ పేరాల భరతశర్మ, ముర్వలవానిపాలెం కాలనీ, విశాఖపట్టణం.

30. ఆచార్య ఎం. కులశేఖరరావు, విద్యానగర్, హైదరాబాదు.

31. శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, టి.టి.డి., తిరుపతి.

32. శ్రీమతి ఆచంట కమలకుమారి, బెంగుళూరు.

33. శ్రీ వై. వెంకట సుబ్బారావు. తెనాలి, గుంటూరుజిల్లా.

34. డా.పరిమి రామనరసింహం, రీడరు, తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

35. శ్రీ గన్ను కృష్ణమూర్తి, సిద్ధిపేట, మెదక్‌జిల్లా.

36. డా. జె. మునిరత్నం, ఉపన్యాసకులు, తెలుగు అధ్యయన శాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి

37. శ్రీమతి టి. విమల, పరిశోధకురాలు, తెలుగు అధ్యయన శాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి



'మధుర కవి'

కీ. శే. మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి

(1890 - 1950)

